


# *OUR HOMAGE*

To the late

PADMASHREE V. NAGIAH

**an ARTISTE without compare**

**who brought a new demension**

**to the Telugu Film Industry**

**investing it with a Cultural**

**Heritage and a Classic Import**

**as an ACTOR–DIRECTOR–**

**MUSIC DIRECTOR and PRODUCER.**

**VIJAYA PRODUCTIONS (P) LTD.,**

**(VIJAYA-VAUHINI STUDIOS)**

**VADAPALANI, MADRAS-26.**

# మా మాట !



ఏ కోణంలోనుంచి చూచినా యిది ఒక 'రజతాక్షర దినం'. తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ నడిపిన ప్రయత్నంతో కళాకారులందరికీ మకుటంలేని మహారాజు అనదగ్గ నాగయ్య కాంస్య విగ్రహ ప్రతిష్ఠ యీనాడు జరిగింది. గత మూడేళ్ళ నుంచి ఆశ, నిరాశల, వెలుగు, చీకట్ల మధ్య నడిచిన ఒక 'యజ్ఞం' యీ నాటితో పరిసమాప్తి నందింది. ఈ యజ్ఞ నిర్వహణలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను మాకు ఎందరో మహామహులు తోడ్పడ్డారు. వారందరికి- ముఖ్యంగా మద్రాసు కార్పొరేషన్ వ్యవహారాలలో మాకు సముచితరీతిని సాయపడ్డ డాక్టరు కె. వి. స్వామికి- యీ శుభ సమయంలో మా నమోవాకాల నర్పిస్తున్నాం.

విగ్రహ ప్రతిష్ఠాపనోత్సవాన్ని పురస్కరించుకుని "సర్వాంగ సుందరంగా 'నాగయ్య స్మారక సంచిక'ను తీసుకురావాలని సంకల్పించాం. ఆ సంకల్పం రూపుతీసుకోవడంలో ఎందరో తమ సహాయ, సహకార, సానుభూతులను మాకు అందజేశారు. ముఖ్యంగా అన్నపూర్ణా పిక్చర్సు అధినేత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, జైహింద్ స్టూడియోస్ అధినేత శ్రీ ఎం. సత్యం, పబ్లిసిటీ ఆర్టిస్టు కృష్ణ రామరావ్ ప్రింటర్సు యజమాని శ్రీ గోటేటి శ్రీ రామారావు, శివం ప్రాసెస్ అధిపతి శ్రీ వి. రాఘవం మాకు సముచిత రీతి సాయం సలిపారు. ఎందరో చిత్ర నిర్మాణ సంస్థల అధినేతలు, తదితరులు యీ సంచికకు తమ వ్యాపార ప్రకటనలను అందజేశారు. చిత్ర సీమలోని కొందరు ప్రముఖులు అమూల్యమైన తమ రచనలను మా సంచికకు అంపారు. వీరందరికీ మా కృతజ్ఞతను వెల్లడిస్తున్నాం.

ఈ నాడు యిక్కడ ప్రతిష్ఠింపబడిన నాగయ్య కాంస్య విగ్రహం తన కాంతి కిరణాలను వెదజల్లుతూ, భావితరాల కళాకారులందరికీ ఒక వెలుగుబాటను చూపెడుతుందని మేము ఆశిస్తున్నాం. ఈ రోజు విడుదల చేయబడిన 'నాగయ్య స్మారక సంచిక' ఆ మహామనీషి విశ్వరూపాన్ని కొంత వరకైనా కళాత్మకంగా చిత్రించగలిగిందని మేము తలుస్తున్నాం. అయినప్పటికీ యీ సంచిక నాగయ్య బహుముఖ వ్యక్తిత్వాన్ని తెలుసుకొనగోరే వారికి పూర్తిగా విందును చేకూర్చకపోదని మా నమ్మకం.

కాలం శరవేగంతో పరిభ్రమిస్తోంది. ఈ నాటి వెనకాల ఉన్న మూడేళ్ళ 'చరిత్ర' యింతటితో ముగిసింది. 'అసతోమాసద్గమయ-తమసోమాజ్యోతిర్గమయ-మృత్యోర్మా అమృతంగమయ-ఆవిరావీర్మయేధి-రుద్రాయత్తే దక్షిణం ముఖం-తేనమాం పాహినిత్యమ్-ఓం శాంతి. శాంతి శాంతిః' అన్న ఉపనిషత్ శ్లోకాన్ని భక్తి ప్రపత్తులతో పఠిస్తూ, మీవద్ద సెలవు తీసుకుంటున్నాం.

**గుమ్మడి వెంకటేశ్వరరావు,**
కోశాధికారి

**ఇంటూరి వెంకటేశ్వరరావు,**
కార్యదర్శి

నాగయ్య స్మారక నిధి,
12/6, ఆండవర్ నగర్, మద్రాసు-600 024.
ఫోన్ : 421029



ఎందరో మహానుభావులు !

అందరికీ వందనములు !



# MESSAGES ... ... ...

*Sri Mohanlal Sukhadia,* GOVERNER OF TAMILNADU.

"I am glad to know that a life-size bronze statue of late Padmasri Chittoor V. Nagayya is proposed to be installed at Panagal Park on the 28th March '77. I wish the function every success."

*Dr. P. V. Rajamannar* Ex. CHIEF JUSTICE, MADRAS.



"I was gratified to learn from your letter that the late Padmasri Chittoor V. Nagayya's memory will be cherished by erecting his life-size bronze statue in the north-east corner of Panagal Park in Thyagarayanagar where he spent most of his last years. I have known him intimately for several decades and I can say with out hesitation that he was one of those rare men of God, endowed with versatile gifts. He will always occupy an important place in the history of South Indian film. He acted with equal facility and felicity in Tamil, Canerese, Malayalam and Hindi films as in Telugu. In the portrayal of character he was unequaled. Because of his inherent spiritual nature he was able to play the roles of Potana, Vemana, Thyagayya and Ramadas in a superb manner. He was an ardent Bhaktha, extremely emotional with a fundamental trait of renunciation.

Nagayya was also a great stage-actor and a musician with a most alluring voice.

If he had one fault, it was his limitless generosity. I say 'limitless' because his charity sometimes exceeded his assets. The result was that his last days were spent in misery. I shall always treasure the memory of the times that I spent with him among my invaluable possessions. I wish the installation function all success."

*Dr K. V. Gopalaswamy,* President, Andhra Pradesh Sangita Nataka Akademy.

'I am glad to hear that the Telugu Cine Artistes' Association is installing a life-size bronze statue of Padmasri Chittoor V. Nagayya in the North-east corner of Panagal Park, Madras. Sri Nagayya's contribution to the film world and to the freedom struggle is well-known. I have great pleasure in wishing the function every success.'

దక్షిణభారత చలన చిత్రాకాశంలో

ధృవతార శ్రీ నాగయ్యకు మా జోహార్లు

—(❁)—

మాచే నిర్మింపబడ్డ

తెలుగు చిత్రాలు

- ఆడజన్మ
- అమ్మ మాట
- అమ్మ మనసు

—: దత్తమండలాలకు—మావద్ద పంపిణీకి సిద్ధంగా ఉన్న తెలుగుచిత్రాలు :—

* సువర్ణ సుందరి * స్వర్ణమంజరి * దేవాంతకుడు * నాదీ ఆడజన్మే * కథా నాయకుని కథ * వీర కంకణం * మల్లీశ్వరి * నిన్నే పెళ్ళాడుతా * రేచుక్క * తోడు నీడ * సవతి కొడుకు * బండరాముడు * పెంకిపెళ్ళాం * ఆప్తమిత్రులు * దాసి * ఎర్రకోట వీరుడు * అభిమానం * ఋణానుబంధం * సెభాష్ రాజా * అమ్మ మనసు * ఆడ జన్మ * పట్టుకుంటే లక్ష * భక్త రామదాసు * పెద్దలు మారాలి * విజరూపాలు * పక్కింటి అమ్మాయి * భూలోక రంభ * శ్రీ కనక దుర్గ పూజామహిమ * ప్రచండ భైరవి * కాశ్మీర్ బుల్లోడు * రాజ్యంలోరాబందులు • పెద్దమనుషులు • పడుచుపిల్ల పగటిదొంగలు • బలేబావ • గాయ్‌జొర్‌గౌరీ • అలింగన్.



## విజయలక్ష్మి మూవీస్,

— చలనచిత్ర పంపిణీదార్లు ; —


హెడ్ ఆఫీస్ :
19/1, రాజబహదర్ స్ట్రీట్,
మద్రాసు-600017
ఫోన్ : 442973

572, పెద్దకాపువీధి,
తిరుపతి
ఫోన్ : 2899

బ్రాంచి ఆఫీస్ :
గుంతకల్లు-2
ఫోన్ : 289

**Sri D. V. S. RAJU.** Messrs D. V. S. Productions, Madras.

"I am exceedingly glad to know that a life-size bronze statue of late Padmasri Chittoor V. Nagayya is to be installed in the north east corner of Panagal Park, Madras by the Telugu Cine Artistes' Association. He was a very great artiste and his portrayal of spiritual leaders like Vemana, Potana, Thyagayya and Ramadas earned for him unprecedented acclaim. He was a singer 'PAR EXCELLANCE'. May his memory ever inspire our film world."

**Sri K. RAJAGOPAL CHETTY.** President, The South India Film Chamber of Commerce, Madras.

"I am very happy to learn that the Telugu Cine Artistes' Association has come forward to install a life-size bronze statue of Late Padmasri V. Nagayya at Panagal Park, Madras and that a SOUVENIR is being brought out by you befitting the occasion. While I congratulate the Telugu Cine Artistes' Association for their noble act I wish the function and the SOUVENIR all success."

**Sri J. V. SOMAYAJULU.** President, Chennapuri Andhra Maha Sabha, Madras.



"Sri Vuppalathadiam Nagayya Garu, popularly known as Chittoor V. Nagayya garu, was one of the greatest actors that the Andhra State produced after Bellary Raghavachary in this country. Sri Nagayya was not only an in-born actor but a great benefactor to many artistes who are today occupying some of the most prominent positions in cinema as well as drama in South India. He was an institution and he patronised many deserving young artistes as well as many institutions devoted to art and culture. Films like 'Bhakta Pothana,' 'YOGI VEMANA', 'THYAGAYYA' and 'Bhakta Ramadas' not only reveal his intense devotion to religion and faith in Almightly but also acquired an innate value and serve today as illustrious models for the generations to follow. Above all Sri Nagayya had a great virtue in trying to pick up the talent wherever it was available and he encouraged them with all the sincerity by rendering all possible help As a man he had a great and noble heart and his house was open at all times to all his friends and guests. He was fortunate not only in being recognised by the Govt. of India but also in receiving respect from all his colleagues and admiration from the public during his life-time, He was really a 'KARMAYOGI' in facing many trials and tribulations with unperturbed calmness and his inimitable cheerfulness. The erection of his statue in Madras is sure to inspire the generations to come to serve and contribute their mite to the developmeni of our art and culture for which he lived and died."

**Sri S. L. NAHATA :**

"I am very glad that a life-size bronze statue of late Shri Nagayya will be installed on the 28th March, 1977 in Panagal Park, Madras. As a producer and distributor I was associated with Shri Nagayya for over twentyfive years and had known him very intimately. Besides distributing his historic and unforgettable picture 'RAMADAS' I had the privilege of using his artistic talents in mamy of my films, some of which are 'SHANTINIVASAM', 'MARAPURANI KADHA' etc. Late Shri Nagayya was not only an artiste of fearless acting of histrionic talents but also a gentleman to the core. His qualities of head and heart are innumerable. In fact he was all-in-one in celluloid-producer, director, music director, singer, actor, writer etc. It is befitting that you should have decided to install a life-size bronze statue as this will be a source of inspiration to the film industry and its technicians to emulate his qualities. I wish the function all success."



**Sri J. VENGAL RAO,** Chief Minister, Govt. of Andhra Pradesh, Hyderabad :

"I welcome the move to install a life-size statue of the celebrated film artiste Late Padmasri Chittoor V. Nagayya, at Panagal Park, Madras. He was a most gifted thespian and during his life time he had carved out for himself a niche in the affections of millions of cine-goers in this part of the country. He portrayed a wide variety of roles on the silver screen and did full justice to tnem all. His place is assured in the history of Telugu films".

**Sri B. NAGI REDDY :**

"It gives me immense pleasure to learn that the life-size bronze statue of Late Padmasri Chittoor V. Nagayya is going to be installed by the Telugu Cine Artistes' Association in the north-east corner of Panagal Park. Sri Nagayya was a very great multi-lingual artiste and a singer. I am sure the statue of this illustrious soul will serve as a beacon light to the younger generation of artistes. I heartily wish the historic function every success".



**Sri B. V. S. S. MANI,**



"The histrionic talents of Sri Nagayya are unchallengeable. Sri Nagayya has provided an opportunity for one and all to educate themselves in righteousness and God-fearing nature, by adopting the audio visual method, even a quarter of a century back, by portrayals which he alone is capable of portraying of great lives of saints like VEMANA, POTHANA, RAMADAS, THYAGARAJA etc. I am confident that the bronze statue to be erected will be a befitting tribute to his services to art and theosophy and will positively help the present generation and the future generations to ponder over the divine greatness of the people whom Sri Nagayya has portrayed in his own inimitable style, this statue serving as a constant reminder. Will we not be correct to say that Sri Nagayya will ever live green in the memories of all by the catching portrayals he had made".

**శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా,** డైరెక్టరు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ, సమాచార, పౌరసంబంధశాఖ.

హైదరాబాదు.



"స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారి కాంస్య విగ్రహాన్ని దక్షిణభారత చలనచిత్ర కేంద్రమైన మద్రాసు నగరంలో నెలకొల్ప బోతున్నారని తెలుసుకొని నేను చాలా ఆనందిస్తున్నా. శ్రీనాగయ్య నటుడుగా. గాయకుడుగా. సంగీత దర్శకుడుగా. చిత్ర దర్శకుడుగా దక్షిణభారత చలన చిత్రసీమలో అపూర్వ ఖ్యాతిని గడించారు. ముఖ్యంగా ఆయన పోషించిన పోతన. వేమన, త్యాగయ్య. రామదాసు వంటి భక్తుల పాత్రలు తెలుగు సినిమా ప్రేక్షకుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోగలవు. శ్రీ నాగయ్య తెలుగులోనేకాక కన్నడ, మలయాళ, హిందీ చిత్రాలలో కూడా నటించి. అఖిలభారత ఖ్యాతిని ఆర్జించారు. నటునిగానేకాక గొప్ప దాతగా ఆయన అనేక సంస్థలకు. వ్యక్తులకు దానధర్మాలుచేసి. తనకేమీ మిగుల్చుకోలేకపోయారు. సినిమా రంగంలో ప్రవేశించికముందు శ్రీ నాగయ్య భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, తనదేశ భక్తిని వెల్లడించుకొనడమేకాక జైళ్ళల్లో మగ్గుతున్న అనేక జాతీయనాయకుల కుటుంబాలను పోషించారు. ఇటువంటి మరపురాని వ్యక్తి అయిన శ్రీ నాగయ్య విగ్రహాన్ని ఆయన కార్యకలాపాలకు కేంద్రమైన మద్రాసు నగరంలో స్థాపించడం ఆయనపట్ల మనకుగల గౌరవాన్ని ప్రదర్శించుకోవడం కాగలదు."

దక్షిణ భారత చలన చిత్రాకాశంలో ధ్రువతారగా
వెలసిన స్వర్గీయ శ్రీ నాగయ్య దివ్యస్మృతికి
మా అంజలి ఘటిస్తున్నాం.





వెంపటి చిన సత్యం



కూచిపూడి ఆర్ట్స్ అకాడమీ,
5, ప్రకాశం రోడ్, మద్రాసు - 600 017.

# అపర త్యాగయ్య-శ్రీ నాగయ్య

రచన పద్మశ్రీ డాక్టరు. పి. భానుమతి

**'Artistes are born. not made'** అన్నది ఒక ఆంగ్ల ప్రవచనం. ఈ ప్రవచనానికి ప్రత్యక్ష సాక్ష్యం మహానటులు పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారు.

తెలుగు సినిమా చరిత్రలో ఆయనదొక స్వర్ణయుగం. హావ. భావాలను ప్రదర్శించడంలోనూ, భావ. రాగ. తాళ యుక్తంగా సంగీతం పాడడంలోనూ ఆయనదొక విశిష్ట శైలి; వ్యక్తిత్వ ముద్రపడిన ఒక పోకడ.

భక్తుల పాత్రలు పోషించడంలో నాగయ్యగారికి నాగయ్యగారే సాటి. పోతన, వేమన, త్యాగయ్య, రామదాసు పాత్రలను పోషించడంలో ఆయన పరాకాష్ఠ, అశేష సినిమా ప్రేక్షక ప్రజానీకపు హృదయ పీఠాన్ని అధిష్ఠించగలిగారు.

తెలుగు సినిమా లోకంలోనేకాక తమిళ సినిమా ప్రపంచంలోకూడా ఆయన తన కీర్తి పతాకాన్ని ప్రతిష్ఠించారు. 'అశోక్‌కుమార్', 'భక్త మీరా', 'చక్రధారి', 'ఏళై పడుం పాడు' మొదలయిన చిత్రాలలో ఆయన అగుపరిచిన నటన అత్యుత్తమ ప్రమాణాలతో కూడుకొని, తమిళ సినిమా ప్రేక్షకులకు షడ్రసోపేతమయిన విందు నొసగింది.

శ్రీ నాగయ్య నాకు పితృ సమానులు. నేనంటేవారికి ఎంతో అభిమానం. కొన్ని తెలుగు, తమిళ చిత్రాలలో ఆ మహానటునితో నటించే భాగ్యం లభించడం నా అదృష్టం. 'స్వర్గసీమ' చిత్రంలో సందర్భోచితంగా, పాత్ర ముఖాన 'భవిష్యత్తులో నీవొక గొప్ప కళాకారిణివి అవుతావు' అని ఆయన నన్ను ఆశీర్వదించారు. ఆ ఆశీర్వాదం నాపట్ల ఒక అమృత భాండంగా రూపొందిందని నేను సవినయంగా చెప్పకోక తప్పదు. సంగీతంలో ఆ మహాపురుషుని నేను 'అపర త్యాగయ్య' గా భావిస్తాను. త్యాగరాజు స్వామి కీర్తన 'నగుమోము' ను నా చిత్రంలో నేను ప్రవేశపెట్టేముందు దానిని "సినిమేటిక్" గా మార్పు చేసి వారికి పాడి వినిపించాను. వారు దానికి తమ హర్షామోదాలను వెల్లడించారు. సంగీత ప్రపంచంలో నాకుండే ఆశయాలు, లక్ష్యాలు నాకున్నాయి. వారికి అవి తెలుసును కాబట్టే పుత్రీవాత్సల్యంతో నన్ను వారు లాలించారు. 'వివాహ బంధం', 'అంతా మనమంచికే', 'తోడునీడలు' మొదలయిన చిత్రాలలో వారు నాకు తండ్రిగా అగపడి నాపట్ల వారు అగుపరిచిన అభిమానాన్ని నేను ఇప్పటికీ మరువలేను.

వ్యక్తులు, సంస్థలు, సామ్రాజ్యాలు ఒక వెలుగువెలిగి కాలగర్భంలో కలిసిపోక తప్పదు. ఇదొక చారిత్రక సత్యం. ఒకప్పుడు గొప్ప వెలుగు వెలిగిన నాగయ్యగారు—లక్షలకు లక్షల రూపాయిల నార్జించిన ఆ మహానటులు—ఆఖరుకు ఆర్థిక బాధను భరించలేక చిన్న చిన్న వేషాలు వేయడానికికూడా సిద్ధపడాల్సివచ్చిన విధి వైపరీత్యంకాక మరేమవుతుంది? ఆర్జించిన డబ్బంతా దానధర్మాలకు ఖర్చుపెట్టి ఆయనొక వైరాగిగా ఆఖరుకు రూపొందడం—కళాకారులందరు కంటతడిపెట్టవలసిన విషయం.

మూర్తీభవించిన వాల్మీకిని సృష్టించిన ఆ 'నిత్యయోగి'- భగవద్గీతలోని స్థితప్రజ్ఞుని లక్షణాలను తనలో మూర్తీభవింపజేసుకున్న ఆ పుణ్య పురుషుడు—విగ్రహరూపంలో పానగల్ పార్కు ఈశాన్య భాగంలో వెలయడం మన కళాకారులందరి భాగ్యం. కళాకారులందరికి వెలుగుబాటను చూపేటి. అది వారిలో చైతన్య స్రవంతి యింకిపోకుండా చేయగలుగుతుందని నేను నమ్ముతున్నా. "నారుమ జ్ఞాన కీర్తుల బరగెనేని వాని సంపద ఒక పూటయైన చాలు" అన్న పద్యానికి ప్రత్యక్ష నిదర్శన మనదగ్గ ఆ కళాకారునకు భక్తి పూర్వకంగా నేను అంజలి ఘటిస్తున్నా.



# అజాత శత్రువు శ్రీనాగయ్య

రచన:
గుమ్మడి వెంకటేశ్వరరావు

'నాగయ్య'-యీ పేరు ఆంధ్రదేశంలో ఎంత సాధారణ మయినదో-నాలుగు దశాబ్దాలపాటు తెలుగు చిత్రజగత్తుకు తలమానికంగా మహోన్నత స్థానంలో యీ పేరున ఉన్న నటుడు-అంత అసాధారణమైన వ్యక్తి !



నటుడుగా, నాయకుడుగా, దర్శకుడుగా, సంగీత దర్శకుడుగా నిర్మాతగా తెలుగు సినిమా పరిశ్రమకు సర్వతోముఖంగా సేవచేసి-తెలుగు చిత్రాలకు ఒక స్థాయిని, తెలుగు నటులకు గౌరవాన్ని, సంఘంలో ఒక స్థానాన్ని సంపాదించి పెట్టిన కొద్దిమంది వ్యక్తులలో చిత్తూరు నాగయ్యగారు ఒకరు !...

దక్షిణ భారత చలనచిత్ర చరిత్రను సమగ్రంగా ఏ భావి చరిత్రకారుడయినా వ్రాస్తే అందులో శ్రీ నాగయ్యగారి స్థానం మహోన్నతంగా చిత్రించి తీరాలి-ఆ అధ్యాయం అందరు నటులకు అధ్యయనం కావాలి ! . . .

మనిషి అంతస్తుతోపాటు మానవత్వాన్ని, పేరు ప్రఖ్యాతులతోపాటు వినయవిధేయతలను పెంచుకున్న ఉత్తమ కళాకారులు-అత్యంత ఉన్నత స్థితిలోవున్నా అహంకారాన్ని దరికి రానీయని ఆదర్శమూర్తి !

సహనటీనటులతో ఆయన ప్రవర్తించిన తీరు-తన కంటె చిన్నవారిపట్ల, కొత్తవారియెడల ఆయన అనుసరించిన అనురాగం, ఆత్మీయత మరువరానివి; ప్రతి నటునకు ఆదర్శప్రాయమైనవి ! .అలాగే ఆయన అతి మంచితనంతో జీవితంలో చేసిన కొన్ని పొరపాట్లు-వాటి ఫలితాలుకూడా భావితరాల నటీనటులకు గుణపాఠాలే !....

మహాపురుషులు-రాజ్యాంగ వేత్తలు-ప్రభుత్వాధినేతలకు ఆయనపట్ల ఎంతటి గౌరవభావాలుండేవో ప్రత్యక్షంగా చూచినవాళ్ళల్లో నేనుకూడా ఒకణ్ణి !...

పూజ్యులు సర్వేపల్లి రాధాకృష్ణగారు రాష్ట్రపతిగా ఉండగా-ఏ తెలుగు నటుడు ఢిల్లీలో ఆయనను చూడడానికి వెళ్ళినా ఆయన అడిగేవారు " నాగయ్యగారు బాగున్నారా" అని !...

ఒకసారి ఏదో కార్యక్రమంమీద రాష్ట్రపతిగా ఆయన మద్రాసు వచ్చినప్పుడు నాగయ్యగారు, నేను, మరొక మిత్రుడు వారిని చూడడానికి మైలాపూర్‌లోవున్న వారింటికి వెళ్లాం. నాగయ్యగారు వచ్చారని తెలియగానే ఆయన గుమ్మం వద్దకు ఎదురు వచ్చారు. నాతోవున్న మిత్రుడు ఆయనకు సాష్టాంగ వందనం చేశాడు. ఆయన్ని లేవనెత్తి రాధాకృష్ణగారు అన్నారు: " మావంటివారికి సాష్టాంగవందన మెందుకయ్యా-మీ ప్రక్కనున్న నాగయ్యగారికి చేస్తే మంచి పుణ్యం వస్తుంది" అని !...

ఆ మాటలు విన్న నేను పులకించి పోయాను. పోతనగా, వేమనగా, త్యాగయ్యగా శ్రీ నాగయ్యగారి

ఆ మేధావిపైనే అంతబలమైన ముద్రవేసినప్పుడు యిక సామాన్య ప్రేక్షకులు ఎంత ప్రభావితులై ఉంటారో మనం ఊహించుకోవచ్చు. ఆ పాత్రలలో ఆయన జీవించారు; తరించారు; దేశాన్ని తరింప జేశారు. అన్నట్టు ఆయన ధరించిన కొన్ని పాత్రలు మరొకరు నిర్వహించడం ఎంత సాహసమో పోతనద్వారానే నాకూ అనుభవం అయింది.

రెండవసారి పేరున 'పోతన' చిత్రం పూర్తి అయిం తరువాత-అందులో పోతనగా నేను నటిస్తున్నానని తెలిసి-చిత్రం ఒకసారి చూడాలని ఉందని-వీలయినంత త్వరలో కాపీ ఒకటి ఢిల్లీ పంపించే యేర్పాట్లు చేస్తే చాలా సంతోషపడతాననీ- రాష్ట్రపతి గారి వద్దనుంచి ఉత్తర మొకటి నాకు వచ్చింది. వెంటనే నిర్మాతలతో మాట్లాడి కాపీ ఒకటి ఢిల్లీ పంపే ఏర్పాటు చేశాను.

అక్కడ రాష్ట్రపతితోపాటు చిత్రాన్ని చూచి స్వర్గీయ సంజీవయ్యగారు నాకు ఉత్తరం వ్రాశారు. 'మహామంత్రి తిమ్మరుసుగా మిమ్మల్ని చూచి ఎంత ఆనందపడ్డానో పోతనగా చూచి అంత బాధపడ్డాను. పోతనగా మీరు మాకు నిరాశ కలిగించారు' అని.... అదీగాక చాలాచోట్ల నుంచి మిత్రులు అనేకమంది పోతన పాత్ర చాలా అసంతృప్తిగా వుందని వ్రాశారు. ఆ తరువాత కొద్ది రోజులకు ఏదో షూటింగులో నాగయ్యగారు, నేను కలిశాం. సందర్భవశాత్తు పై విషయమంతా ఆయనకు వివరంగా చెప్పాను. అలా అలా మా సంభాషణ మున్ముందువరకు బాలయోగి పైకి వెళ్ళింది.

నే నన్నాను; "నాగయ్యగారూ-మీ పోతన చూచికదా బాలయోగి సమాధిలోకి వెళ్ళాడు; ఆయన్ను బయటికి తీసుకురావాలంటే ఒకేఒక మార్గం ఉంది" అని....'ఏమిటా మార్గం' అన్నారాయన :.... "నా పోతన చూస్తేసరి" అన్నాను. అక్కడున్నవారంతా పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు. కాని నాగయ్యగారు మాత్రం నవ్వలేదు. బాధ పడ్డారు. ఆవేదన పడ్డారు. చిత్రంపై విమర్శలు విన్న తరువాత ఒక నటుడుగా నేనెంత మానసిక క్షోభను అనుభవించి ఉంటానో ఊహించగలిగింది ఆయన ఒక్కరే :....అదే ఆయన ఔన్నత్యం : ...

ఆత్మ విశ్వాసమే తప్ప అహంకారం అణుమాత్ర మైనాలేని ఆ మహోన్నత వ్యక్తిత్వానికి మరొక నిదర్శనం చెబుతాను. వారికి 'పద్మశ్రీ' వచ్చిన తరువాత ఆయన ఢిల్లీ వెళ్ళి-ఆ సత్కారాన్నిపొంది 'పద్మశ్రీ' పతకాన్ని స్వీకరించి-మద్రాసుకు తిరిగి వచ్చారు. వారికి ఫోనుచేసి అభినందనలు అందజేసి-చూడడానికి వస్తున్నానని చెప్పాను. "మీరు రానవసరంలేదు; నేనే మీ యింటికి వస్తున్నాను" అన్నారు. అలాగే అయిదు నిమిషాలలో ఆ పతకం తీసుకోని ఆయన మా యింటికొచ్చారు. అది చూపించి 'నాయనా-యిది నా ఒక్కడిదికాదు; యీ సత్కారంలో, యీ గౌరవంలో మీ అందరికీ భాగం ఉంది-మీ అందరు చేసిన సేవలకు ప్రతిరూపం యిది-కాకపోతే వయసులో నేను మీ అందరికంటె పెద్దవాణ్ణి గనుక నా కిచ్చారు-నా ద్వారా మీకందరికీ అందజేశారు' అన్నారు.

ఇదీ ఆయన మహోన్నత సంస్కారం-అనితరసాధ్య మయిన వినయసంపద :....

ప్రపంచ ప్రఖ్యాత గాయకీమణి శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి త్యాగరాయ కీర్తనలు భావయుక్తంగా ఎలా పాడాలో ఆయన దగ్గరకువచ్చి నేర్చుకుని వెళ్ళిందని విన్న ప్పుడు- 'భక్తపోతన' చిత్రం తరువాత తిరుపతి దేవస్థానం మహంతు చరిత్రలో ఎవ్వరికీ జరుగని విధంగా రత్నకంబళి పరిచి పాదపూజ చేశారని విన్నప్పుడు-సాటి కళాకారునిగా పొందిన ఆనందం మాటలలో చెప్పలేను. అలాగే ఒకప్పుడు అంటే దాదాపు ముప్పయియేళ్ళక్రితం-ఒక చిత్రానికి పారి తోషికంగా లక్షరూపాయిలు తీసుకున్న నాగయ్యగారు చివరిరోజుల్లో కొన్ని వందల రూపాయిలకు పనిచేశారని తెలిసినప్పుడు 'కాల మహిమ' అని ఆశ్చర్యపడక తప్పదు : ....

అందుకనే జీవితంలో యిన్ని మిట్టపల్లాలు-వెలుగు నీడలు చూచిన శ్రీ చిత్తూరు నాగయ్యగారి జీవిత చరిత్ర భావితరాల నటీనటులకు విధిగా అభ్యసించవలసిన పాఠ్య భాగం : ....



# నాగయ్య స్వీయచరిత్ర నుండి

"త్యాగయ్య చిత్రం చాలాచోట్ల వందరోజులు ఆడింది. ఆంధ్ర. తమిళ. కేరళ, మైసూరు రాష్ట్రాలన్నింటిలోను అద్భుతంగా పోయింది. బెంగుళూరులో అది రజతోత్సవం జరుపుకున్నది.

'త్యాగయ్య' చిత్రం తరువాత నాకు తిరువాన్కూర్. మైసూరు సంస్థానాలలో అతిఘనమైన సత్కారాలు జరిగాయి. ఇవి నా జీవితంలో మధురమైన, మహత్తరమైన ఘట్టాలు. ఒక కళాకారుడి శ్రమకు యింతకంటె తగిన ఫలితం ఏమి ఉండగలదు ?

మహా పండితుల మధ్య, రాజ విద్వాంసుల మధ్య, మేధావుల మధ్య తిరువాన్కూరు మహారాణావారు నాకు ఘన సత్కారం చేశారు. సకల రాజ మర్యాదలతోను. మేళతాళాలతోను నన్ను దర్బారుకు తీసుకెళ్లారు. అందరూ కొలువు తీర్చిఉండగా రాజుగారు గద్దెదిగివచ్చి. సాదరంగా



" పలికెడిది భాగవతమట–పలికించెడు వాడు రామభద్రుండట–పలికిన భవహరమగునట – పలికెద వేరొండు గాధ పలుకగనేలా "....
పోతనగా శ్రీనాగయ్య....



"రాళ్ళు దేవుళ్ళయితే రాసులు మింగవా విశ్వదాభిరామ వినురవేమ"
వేమనగా శ్రీ నాగయ్య...

నన్ను కౌగిలించుకుని తీసుకువెళ్ళి, తన సరసన కూర్చో బెట్టుకుని, మహావ్యక్తుల సమక్షంలో నాకు వేదోక్తంగా పాదపూజ చేశారు. లక్ష్మీ సంపన్నులు, గౌరవనీయులు అయిన మహారాజా నా కాళ్లు కడుగుతోంటే నేనుపొందిన అనుభూతి ఏమని వర్ణించను!....గొప్ప కానుకలు నాకు బహూకరిస్తూ 'అభినవ త్యాగరాజు' అని నాకు బిరుదు ప్రదానం చేశారు మహారాజా. ఆ ఘనత, ఆ గౌరవం నాకు దక్కినందుకు—నా జన్మ చరితార్థమైనందుకు—నేను ఎంతగా ఆనందించానో చెప్పడానికి పలుకులులేవు: రాయ డానికి మాటలు చాలవు.

అలాగే మైసూరు సంస్థానంలోకూడా నాకు సన్మానం జరిగింది. రాజ బంధువులందరు ప్రత్యేకంగా ప్రదర్శన యేర్పాటు చేసుకుని, 'త్యాగయ్య' చూశారు. రాజభవనానికి నన్ను ఆహ్వానించి, సకల మర్యాదలతో నన్ను గౌర వించి, పెద్ద వెండి పళ్లెంలో 101 బంగారు కాసులుపోసి బహూకరించారు. శ్రీరామచంద్రుడు బొమ్మతో వున్న పతాకం కల బంగారు గొలుసు నా మెడలో వేశారు. బెంగుళూరు థియేటర్ యజమానికూడా తన థియేటరుకు తీసుకువెళ్ళి నాకు 'కనకాభిషేకం' చేశారు.

ఇలా ఎన్నోచోట్ల ఎందరిచేతనో గౌరవాలు, ప్రశంసలు పొందాను. బరంపురంలో నన్ను జీపుమీద నిలుచోబెట్టి బ్రహ్మాండమైన ఊరేగింపు చేశారు. ప్రతి యింటిదగ్గర ఆ యింటివారు పూలమాలలువేసి, హారతులుయిచ్చి ఒక దేశాధినేతకు, ఒక మహానాయకుడికి చేసే మర్యాదలన్నీ చేశారు.

'త్యాగయ్య' చిత్రం సాధించిన విజయం పురస్క రించుకుని పూర్ణామంగరాజుగారు 'శంకరాచార్య' తియ్య మని నన్ను ప్రోత్సహించారు. కాని 'శంకరాచార్య' పాత్రకు నేను పెద్దవాడినయిపోతానని, ఆ పాత్రకు వేరెవరైనా లభించగలిగితే తియ్యవచ్చుననీ అన్నాను. ఆ ప్రయత్నం తరువాత అలాగే ఉండిపోయింది.

ద్వారం వెంకటస్వామి నాయుడిగారిమీద నేను ఒక 500 అడుగుల 'సోలో' చిత్రం తీశాను. ఆయన వైలిన్ వాద్యం అందులో అమోఘంగా ఉన్నది. తరువాత కాలి ఫోర్నియానుంచి దానికి 'ఆఫర్' రాగా పంపించి వేశాను.

ఆ రోజుల్లో త్యాగరాజు జన్మస్థలమైన తిరువాయూరులో సంగీత పాఠశాలలేదు. అక్కడ ఒక సంగీత పాఠశాల

# తెలుగు తెరకు

విఠల్ వారు యింత వరకు సమర్పించిన వినూత్న కానుకలు

- కన్యాదానం
- వద్దంటే పెళ్ళి
- జయవిజయ
- పెళ్లి మీద పెళ్లి
- కనకదుర్గ పూజా మహిమ
- వరలక్ష్మి వ్రతం
- మదన కామరాజు కథ
- గురువుకు మించిన శిష్యుడు
- నవగ్రహ పూజా మహిమ
- అగ్గి పిడుగు
- అగ్గి బరాటా
- అగ్గి దొర
- నిన్నే పెళ్లాడుతా
- అగ్గి వీరుడు
- సి. ఐ. డి. రాజు
- బీదల పాట్లు
- పల్లెటూరి చిన్నోడు
- ఆడదాని అదృష్టం
- కోటలో పాగా

... నిర్మాత : బి. విఠలాచార్య ...

నెలకొల్పాలనే సదుద్దేశం నాకు కలిగి అందరినీ సంప్రదించాను. అందరు ప్రోత్సహించారు. నేను 10 వేల రూపాయల విరాళం యిచ్చాను. ఇవాళ ఆ పాఠశాల అక్కడ అద్భుతంగా నడుస్తున్నది. ఏటా జరిగే సంగీత సభలకు వచ్చే మహా విద్వాంసులందరికీ అది ఆలయమైంది.

మద్రాసులో వున్న ఎన్నో సంగీత సభలలో నేను జీవిత సభ్యుడిగా చేరాను. విరాళాలు యిచ్చాను. వివేకానంద కాలేజీ మొదలయిన కళాశాలలకు, విద్యాశాలలకు భూరివిరాళాలు యిచ్చాను. ఎన్నో వివాహాలు జరిపించాను. మా రేణుకా ఆఫీసులోనే ఎన్నో వివాహాలు జరిగాయి. నాకు అప్పుడు తొమ్మిది కార్లు ఉండేవి. తొమ్మిది కార్లు తిరుగుతూనే ఉండేవి. రేణుకా ఆఫీసు సినిమా ఆఫీసులాగా వుండేదికాదు. ఒక్కొక్కప్పుడు వివాహమంటపం అయ్యేది. ఒక్కొసారి సంగీత సభ అయ్యేది. ఒక్కొక్కప్పుడు పూజా మందిరం, దేవాలయం అయ్యేది. 'త్యాగయ్య' చిత్రం విడుదల అయిన తరువాత ఆంధ్రదేశంలో కూడా త్యాగరాజు సభలు ఆరంభమయినాయి. అప్పుడే నాకు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగా (ఎం. ఎల్. సి.) ఆఫర్ వచ్చింది. రాజకీయాలతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకోవడం ఎందుకని మానేశాను. చాలామంది హితైషులు కూడా ఆ మాటే చెప్పారు.

మధుర గాయకుడు, మహాభక్తుడు అయిన త్యాగయ్య పాత్ర తరువాత నాకు వాహిని వారు మహనీయుడయిన యోగి వేమన పాత్ర నిచ్చారు. ఆ పాత్రకు, యీ పాత్రకు సంబంధంలేదు. అసలు 'యోగి వేమన' పాత్రే వైవిధ్యం గల పాత్ర. మొదటి సగంలో అతను భోగి. రెండో సగంలో యోగి.

ఆ చిత్రం వాహినివారి ప్రతిష్ఠను ఎలా పెంచిందో నా ప్రఖ్యాతినీ అలాగే పెంచింది. వేదాంతపరమైన ఆ విరాగి పాత్రను ధరిస్తూవుంటే నాలో చెప్పలేని మార్పులు కలిగాయి. వేమనపాత్ర నా నిజ జీవితంమీద ప్రభావం చూపెట్టింది. నా జీవిత దృక్పథాన్నే మార్చింది ఆ పాత్ర. ధరించే కొన్ని పాత్రలు వ్యక్తిత్వంమీద ప్రభావం చూపుతాయనడానికి యిదొక నిదర్శనం. నాలో వేదాంత ధోరణి బయలుదేరింది. నా ప్రవర్తనలో మార్పు కనిపించింది. 'వేమన' పాత్రధారణకు నాకు చెప్పలేనంత పేరు లభించింది. అటువంటి మహత్తరమైన పాత్రలను నాకు యిచ్చి నా చేత నటింపజేసి. పేరు ప్రఖ్యాతులు లభింపజేసిన వాహిని సంస్థకు నేను ఎన్ని జన్మలకయినా ఋణపడి ఉంటాను.

'త్యాగయ్య' చిత్రం తరువాత నేను కోడంబాకంలో 52 ఎకరాల పెద్ద తోట కొన్నాను. అందులో వేలాది మామిడిచెట్లు. కొబ్బరిచెట్లు ఉండేవి. ఎంతో రాబడిగల అద్భుతమైన తోట అది. ఇప్పుడు ఆలాంటి తోట అయితే కనీసం 25 లక్షల రూపాయిల ఖరీదు చేస్తుంది. అప్పుడు నేను ఒక మిత్రుని ద్వారా 50 వేల రూపాయిలకుకొన్నాను. నేను చిత్ర పరిశ్రమలో హీరోగా, సంగీత దర్శకునిగా. నిర్మాతగా అవతారాలు ఎత్తాను. పరిశ్రమలో ఒక ప్రముఖ వ్యక్తిగా పరిగణింపబడేవాడిని. ఇదంతా చూసి నా మిత్రులు స్టూడియో అధిపతికాదా ఎందుకు కారాదు? అంటూ ప్రోత్సహించారు. అప్పట్లో మద్రాసులో స్టూడియోలు ఎక్కువగా లేవు. సినిమా పరిశ్రమకు మంచి భవిష్యత్తువున్నది. ఎన్నో స్టూడియోల అవసరం ఉన్నది. అప్పుడు కోడంబాకంలో ఒక్క 'సార్ కంబైన్స్' స్టూడియో మాత్రం ఉండేది. అదీ పనిచేస్తూ వుండేదికాదు. అందువల్ల ఆ ప్రాంతాల్లోనే ఎలాగూ నాకు 52 ఎకరాల స్థలం వున్నది కాబట్టి—ఒక స్టూడియో నిర్మిస్తే బాగుంటుందని పలువురు సలహాలు యిచ్చారు. స్టూడియో నిర్మాణం అంటే చాలా ధనంకావాలి. అంతధనం ఎవరు సహాయం చేస్తారన్న ఆలోచనలో ఉండగా—జమీందారుఅయిన ఒక మిత్రుడు తాను సహాయం చేస్తానని. తానుకూడా స్టూడియోలో భాగస్వామిగా వుంటానని మాట యిచ్చాడు. ఆ మాట తీసుకుని నేను స్టూడియో నిర్మాణం ఆరంభం చేయాలని నిశ్చయించుకున్నాను. నా దగ్గర ఉన్న డబ్బుతో. నా స్థలంలో పెద్దపెద్ద రోడ్లు వేయించాను. స్టూడియో ఎక్విప్‌మెంటుకు ఆర్డరిచ్చి. అడ్వాన్సు చెల్లించాను. పనులు జరుగుతున్నాయి.

ఈలోగా వాహినీ సంస్థ స్టూడియో నిర్మించాలని నిర్ణయించింది. నేను ఆ సంస్థలో ఒక డైరెక్టరును. శ్రీ బి. ఎన్. రెడ్డి అధ్వర్యంలో స్టూడియో నిర్మించడానికి వాహిని సంస్థ నా తోటకు దగ్గరే ఒక స్థలం కొన్నది. నేను చేస్తున్న ప్రయత్నాలకు చాలా విచారించాను. వాహినీ సంస్థలాంటి సంస్థ స్టూడియో నిర్మాణానికి పూనుకోవడం సబబుకాని నాలాంటివాడు తలపెట్టడం ఏమిటి అనిపించింది. అయినా నాకు స్టూడియో ఆలోచన వచ్చేటప్పటికి వాహినికి

(తరువాయి 46వ పేజీలో)

# నటలోకానికి మకుటంలేని మహారాజు నాగయ్య

రచన : ఇంటూరి

తెలుగుదేశంలో అటు నాటక కళాంగనకు పదిహేడేళ్ళ పాటు, యిటు సినిమా కళాలక్ష్మికి నాలుగు దశాబ్దాలపాటు పాదపూజ సలిపి కర్పూర హారతులుపట్టిన మహా నటులలో పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య అగ్రతాంబూలానికి అర్హులనడంలో అతిశయోక్తి యే మాత్రంలేదు.



ఆయన 1904 మార్చి 28వ తేదీ గుంటూరు జిల్లాలోని రేపల్లెలో పుట్టారు. ఆయన తండ్రి శ్రీవుప్పల దడియం రామలింగేశ్వరశర్మ అక్కడ కొంతకాలం ప్రభుత్వ రెవెన్యూ శాఖలో ఒక చిన్న ఉద్యోగిగా పనిచేయడం జరిగింది. చిన్నప్పటినుంచి శ్రీ నాగయ్యకు భారత, భాగోతాలంటే ఎంతో యిష్టం. వాటిలోని పద్యాలను ఆయన కంఠతాపెట్టి పదేపదే పాడుతుండేవారు. తండ్రి శర్మ చక్కని సంగీత విద్వాంసుడు కూడాను. తీరిక సమయాలలో వయలిన్ వాయిస్తూ ఆయన నాదబ్రహ్మను ఉపాసిస్తుండేవారు. ఆ నాదమే పసివాడుగా ఉన్న నాగయ్య చెవులలోపడి, ఆయనకు సంగీత కళాపిపాసను చేకూర్చడంలో ఆశ్చర్యంలేదు.

శ్రీ నాగయ్య అయిదునెలల పసికందుగా ఉన్నప్పుడు ఆయన జీవితంలో ఒక చారిత్రక సంఘటన జరిగింది. శ్రీనాగయ్య అమ్మమ్మ పసిబిడ్డను ఒంటరిగా తొట్టిలో పడుకోబెట్టి మంచినీళ్ళకోసం సమీపంలో ఉన్న బావికి వెళ్ళింది. నీళ్లతో నింపబడ్డ బిందెను బుజాన పెట్టుకొని ఆమె తిరిగి యింట్లో అడుగెట్టడంతోటే పిల్లవానిమీద ఒక నల్లని నాగుబాము పడగవిప్పి ఆడుతుండడం ఆమె కంట పడ్డది. ఒక్కక్షణం ఆవిడ గుండెల్లో గుండెలులేవు. భక్తురాలవడం మూలాన ఆమె మరుక్షణంలోనే తేరుకుని నాగేంద్రుని సమక్షంలో ధూప దీప, నైవేద్యాలు ఉంచింది. నాగుబాము ప్రసన్నతచెంది నైవేద్యాన్ని స్పృశించి, వచ్చిన దారినే బయటికి పాగిపోయింది. ఈ సంగతి తల్లిదండ్రులకు తెలియడంతోటే వాళ్లిద్దరు మంచిరోజుచూసి, నాగప్రతిష్ఠ సల్పి కుఱ్ఱవాడికి "నాగయ్య" అన్న నామకరణం సలిపారు.

అయిదేళ్లొచ్చిన శ్రీనాగయ్యకు యితర విద్యలతోపాటు సంగీతాన్నికూడా తండ్రి స్వయంగా నేర్పాడు. పాఠశాల చదువుమాట అలాఉంచి శ్రీనాగయ్య ఎక్కడయినా సంగీత కచేరీలు జరుగుతోంటే అక్కడికి పరుగెత్తేవాడు. దూరంగా ఉన్న ఒక గ్రామంలో మహా విద్వాంసుడొకడు సంగీతం పాడుతున్నాడని తెలుసుకొని శ్రీ నాగయ్య తన చెవి పోగుల్ని అమ్మి, వాటివల్ల వచ్చిన డబ్బుతో రైలెక్కి, ఆ ఊరువెళ్ళి, ఆ విద్వాంసుని సంగీతాన్ని మనసారా విని యింటికి తిరిగొచ్చాడు. పుత్రుని సంగీత కళాతృష్ణను అవగాహన చేసుకున్న తండ్రి సంగీత విద్వాంసుడయిన చిత్తూరు పేరయ్య పిళ్ళెకు శ్రీనాగయ్యను అప్పగించడం జరిగింది.

శ్రీనాగయ్య దృష్టికేవలం సంగీతంమీదనే కాక నాటకాలమీద కూడా ప్రసరించింది. పాఠశాల విద్యార్థులు



"వందేమాతరం" చిత్రంలో శ్రీమతి కాంచనమాలతో శ్రీ నాగయ్య

ప్రదర్శించే నాటకాలలో ఆయన పాల్గొని. పెక్కు పారితోషికాలను పొందారు. ప్రహ్లాదుని భూమికలో ఆయన తన్మయత్వంపొంది. ప్రేక్షకులను తన్మయులుగా చేయగలిగారు.

ఒకసారి గొప్ప సంగీత విద్వాంసుడయిన పుష్పవనం అయ్యర్, గోవిందస్వామి పిళ్లేల సంగీత కచేరీకి శ్రీ నాగయ్య వెళ్లడం తటస్థించింది. కచేరీ పూర్తయ్యాక సదస్యులు ఎవరి యిండ్లకు వారు వెళ్లిపోయారు. కాని శ్రీనాగయ్య అలాగే ఉండిపోయి పుష్పవనం అయ్యర్ ముఖం వంక అదే పనిగా చూడసాగారు. తనను తదేక ధ్యానంతో చూస్తున్న కుఱ్ఱవాణ్ణి అయ్యర్ 'ఏమిరా నీపేరు అబ్బాయి' అని ప్రశ్నించాడు. కుఱ్ఱవాడు తన అసలుపేరు చెప్పకుండా 'నాపేరు ప్రహ్లాదుడు' అని జవాబిచ్చాడు. ఆ కుఱ్ఱవాడు కళాపిపాసి అని గ్రహించిన పుష్పవనం అయ్యర్ 'నీకేమైనా సంగీతం వచ్చా' అని అడిగాడు. 'ఓ వచ్చు' అని పిల్లవాడు బదులు పలికాడు. వెంటనే అక్కడున్న గోవిందస్వామి పిళ్ళె వయొలిన్ తీసుకొని వాయిస్తుంటే కుఱ్ఱవాడు సుమారు రెండు గంటలసేపు ప్రహ్లాదుని పాత్రలో తానుపాడిన పాటల్ని, పద్యాల్ని కంఠమెత్తి పాడాడు. అయ్యర్ ఆనందానికి అవధులులేవు. తన చల్లని చేతితో ఆయన శ్రీనాగయ్యమీద పుష్ప వృష్టిని కురిపించి 'భవిష్యత్తులో నీవు చక్కని కళాకారుడవు అవుతావు' అని ఆశీర్వదించాడు. శ్రీనాగయ్య యీ సంఘటనను పదేపదే తన స్మృతిపథానికి తెచ్చుకొని, ఆత్మానందాన్ని అనుభవిస్తుండేవారు.

శ్రీనాగయ్య జీవితంలో మరపురాని సంఘటన విఖ్యాత నటుడు ఎస్. జి. కిట్టప్ప దర్శనం. "దశావతారాలు"

నాటకంలో కిట్టప్ప కృష్ణుని భూమికను దాల్చి ప్రేక్షక హృదయాన్ని చూరగొనేవాడు. శ్రీనాగయ్య కిట్టప్ప శ్రీకృష్ణపాత్ర పోషణనుగాంచి తన్మయులై, కిట్టప్పను సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మగా భావించి, రంగస్థలం ఎక్కి, ఆయన ముందు కొబ్బరికాయకొట్టి, కర్పూర హారతి వెలిగించి, సాష్టాంగ దండ ప్రణామం చేశారు ఈ దృశ్యాన్ని చూచిన ప్రేక్షకులు వింతగా నవ్వడం సాగించారు. ప్రాజ్ఞులు కొందరు పిల్లవాడి భక్తి తత్పరతను ప్రశంసించకుండా ఉండలేకపోయారు. కిట్టప్ప శ్రీనాగయ్యను అక్కున చేర్చుకుని, తన నాటక ప్రదర్శనలకన్నిటికి హాజరవడానికి శ్రీనాగయ్యకు శాశ్వతంగా ఒక "ఫ్రీపాస్" యిచ్చాడు.



'మన దేశం' లో శ్రీ నాగయ్య

కంచిలో నయనపిళ్లె అన్న ఒక సంగీత విద్వాంసు డుండేవాడు. ఆయన ఖ్యాతి విని, ఆయన వద్దకు వెళ్లి శ్రీనాగయ్య కొన్నేళ్ళపాటు ఆయన శిష్యరికం చేశాడు. కుంభకోణం వాస్తవ్యులు సంగీత కళానిధి మహారాజపురం విశ్వనాథయ్యర్ వారి వద్ద ఆయన గురుభావంతో సంగీత విద్యను అభ్యసించారు. తరువాత కొంతకాలం చిత్తూరులో, మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆయన విద్యార్థి జీవితం గడిచింది. ఎంతసేపటికి మనసు రెక్కలు విప్పుకొని కళల మీదికి పరుగులు తీస్తుండడంచేత ఆయన కళాశాల చదువుకు మధ్యలోనే స్వస్తి చెప్పడం జరిగింది.

విద్యార్థిదశలోకూడా ఆయన నాటక కళామ తల్లి శుశ్రూషను వదలలేదు. 'శకుంతల' నాటకాన్ని ఆంగ్ల భాషలో ప్రదర్శించి ఆయన కళాభిజ్ఞుల ప్రశంసల నందు కున్నారు.

మద్రాసునుంచి చిత్తూరుకు తిరిగి వచ్చిన శ్రీనాగయ్య రకరకాల ఉద్యోగాలను చవిచూశారు. కాని కళాకారునకు యీ ఉద్యోగాలు ఎల్లా రుచిస్తాయి?... ఆఖరుకు ఆయన చిత్తూరు జిల్లా బోర్డు కార్యాలయంలో ఒక ఉద్యోగాన్ని సంపాదించి, స్థానికంగా ఉన్న రామవిలాస సభ నాటక సంస్థతో సంబంధం పెట్టుకుని, కొంతవరకు మనశ్శాంతిని పొందగలిగారు. చిత్తూరు శ్రీరామ విలాస సభ శ్రీ నాగయ్యలోని 'మహానటుని' బహిర్గతం చేసింది

నాటక రంగస్థలిమీద శ్రీనాగయ్య ప్రథమంలో సావిత్రి, దమయంతి, చిత్రాంగి మొదలయిన ఆడవేషాలు వేశారు. ఆ పాత్రలను పోషించడంలో ఆయన అగపరిచిన హావ భావాలు అశేష ఆంధ్ర నాటకప్రేక్షక ప్రజానీకాన్ని ఆకర్షిం చాయి. చిత్తూరులోని లక్ష్మీవిలాస సభ, మద్రాసులోని సుగుణ విలాససభ, ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ, మరికొన్ని నాటక సంస్థలు ప్రదర్శించిన నాటకాలలో శ్రీనాగయ్య వివిధ పాత్రలను పోషించి వాటికి సంపూర్ణ మయిన న్యాయం చేయడం జరిగింది.

నాటక కళాక్షేత్రంలో కొదమ సింగంలాగా తిరుగాడు తున్న శ్రీనాగయ్యకు శ్రీయుతులు ఆర్. బి. రామకృష్ణ రాజు, బళ్ళారి రాఘవాచారి, పర్వతనేని రామచంద్రా రెడ్డి మొదలయిన కళాకారులతో పరిచయం కలిగింది. వారితో కలిసి ఆయన అనేక నాటక ప్రదర్శనలు యిచ్చారు. నాటక రంగస్థలిమీద 'కహో రామనామ' కీర్తనపాడుతూ 'రామదాసు' నాటకంలో కబీరు రూపంలో ఆయన అడుగిడితే ప్రేక్షక ప్రజానీకం దీర్ఘహర్షధ్వానులు సలిపింది. శ్రీనాగయ్య కిరాయి రూపంలో ఏపాత్ర పోషణకు దిగ లేదన్న సత్యాన్ని మనం విస్మరించకూడదు.

మేఘ గర్జనతో దీటొచ్చే కంఠనాదంతో కబీరు పాత్రలో ఆయన రంగస్థలంమీదికి అడుగెట్టినప్పుడు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు చూడడం జరిగింది. శ్రీనాగయ్య నటనకు ముగ్ధులై శ్రీనాగేశ్వర రావు పంతులు రంగస్థలంమీదికొచ్చి, ఆయనకు హర్ష ధ్వానుల నడుమ 'రంగభూషణ' బిరుదును ప్రసాదించారు. ఆ బిరుదుతోపాటు ఆయనకు దేశోద్ధారకుని చేతులమీదుగా ఒక సువర్ణ పతకంకూడా ముట్టింది.

**Founded by Sri Kowtha Suryanarayana Rao in 1907**

# Indian Commerce & Industries Company (P) Ltd.,

*BEEHIVE BUILDINGS 95, BROADWAY, MADRAS-600001*

Telephone : 2 1 0 7 1 / 3 Lines
Telex : 7 1 0 6

Grams : " LUCKY "
"BEEHIVE"

WORKS:

**Beehive Foundry Engineering Works,** 95, Broadway, Madras-600001
**Kowtha Steel Products,** Ramavarappadu, Krishna District (Andhra Pradesh)

OFFICES AT :

Kowtha Buildings
Buckinghampet
Vijayawada-520002
Phone : 7 6 0 8 0
Grams : "Beehive"

Kowtha Swarajya Vihar
10, Padmanagar
Secunderabad-500025
Phone : 6 1 9 0 7
Grams : "Beehive" Tlx. : 3 8 6

FACILITIES

Steel Processing Industry For Light, Medium & Heavy Structurals, Pattern Shop Foundry, Heat-Treatment & Machine shop for Iron & Steel, Plain and Alloy Castings, Designs & Drawing Office, Analytical Laboratory

PRODUCTS

Iron & Steel Structures Tanks, Stagings, Hand Operated Cranes, Hoppers, Silos Gratings and all Jobbing Works-Annual Capacity Ten Thousand Tonners Cast Iron Castings, Silicon Iron Castings, Etc.

Steel and Alloy Steel Castings including Austenitic Manganese Steel and all Varieties of Nickel Chrome Steel Castings, Acid, Heat, Corrosion resistant Etc.

MATERIALS USED

Imported Indigenous Rolled Steel, Pig Iron, Ferro-Manganese, Coal and Coke Ferro-Alloys Nickel, Chrome, Alloys Etc.

SPECIFICATIONS:

According to Relevant Indian Standard Specifications or Customers' Requirement

INDUSTRIES SERVED

Factory Construction Steel Work For all Industries, Machinery Parts Spares Etc. For all Cement, Sugar, Textile, Fertiliser, Ship-Building, Machine, Tool, Paper, Chemical and other Industries.

ఒక వెంప కర్ణాటక సంగీతంలో ప్రావీణ్యం సంపాదిస్తూ శ్రీనాగయ్య హిందుస్థానీ సంగీత మాధుర్యాన్నికూడా చవి చూశారు. విఖ్యాత సారంగి విద్వాంసుడు ఉస్తాద్ హమీద్ హుసేన్, గాయకుడు అబ్దుల్ ఫయాజ్‌ఖాన్ ఆయనకు ప్రత్యక్ష గురువులు.

కళామతల్లి సేవకు తన జీవితాన్ని అంకితం చేసుకున్న శ్రీనాగయ్యను కొన్ని గృహచ్ఛిద్రాలుకూడా చుట్టుముట్టాయి. ఒకవంక ఆయన తండ్రి పరమ పదించాడు. మరోవంక ఆయన అర్ధాంగి, ఒక చిన్న ఆడపిల్ల కాలధర్మం చెందారు. తిరిగి ఆయన ద్వితీయ కళత్రాన్ని చేపట్టారు. ఆమెకూడా కొంతకాలానికి ఆయనకు దూరమైపోయి. ఆయన హృద యంలో ఆరనిచిచ్చు ముట్టించింది. జీవితంలో ఆయన్ను విరాళ. నిస్పృహలు వెంటాడడం మొదలెట్టాయి.



ఒక తెలుగు చిత్రంలో శ్రీ నాగయ్య

మనశ్శాంతికోసం శ్రీనాగయ్య చిత్తూరు వదిలిపెట్టి ఎక్కడెక్కడో తిరిగారు. రమణ మహర్షి ఆశ్రమంతో పాటు ఆయన పెక్కు క్షేత్రాలను దర్శించారు. జీవితం మీద విరక్తి పుట్టి ఆయన ఆఖరుకు సన్న్యాసాశ్రమ స్వీకా రానికికూడా సిద్ధమయ్యారు. 'కళాక్షేత్రమే నీ కర్మ రంగం ; దానిని వదిలి ఎక్కడికి పోతావు ?.....పో.... దానిలోనే నీవు ఆత్మానందాన్ని అనుభవించాలి' అని అంతరాత్మ ఆయనను ఉద్బోధించింది. ఆ ఉద్బోధనకు అనుగుణ్యంగా ఆయన చిత్తూరుకు తిరిగి వచ్చివేశారు

అది 1932 వ సంవత్సరం. భారత స్వాతంత్ర్య పోరా టానికి సంబంధించిన నినాదాలు ఆయనకు వినపడ్డాయి. జాతీయ నాయకులయిన ప్రకాశం పంతులు. సత్యమూర్తి. శ్రీనివాస అయ్యంగార్, రాజగోపాలాచారి. భూలాభాయి దేశాయి ఉపన్యాసాలు ఆయనను ఉత్తేజ పూరితుణ్ణి చేశాయి. దాంతో ఆయన జిల్లాబోర్డులోని తన ఉద్యో గానికి శాశ్వతంగా తిలోదకాలిచ్చి, మద్రాసుకు వచ్చి, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడం జరిగింది. లాఠీ చార్జీలు, లాకప్‌లు ఆయనకు దక్కాయి. కొన్నివందల సత్యాగ్రహులలో ఆయనకూడా ఒకరవడంచేత జైలు శిక్ష పెద్దపెట్టున ఆయనకు ప్రభుత్వంచేత విధింపబడడానికి అవకాశం లేకపోయింది.

జాతీయభావ ప్రపూరితులయిన శ్రీనాగయ్య వార్ధాకు వెళ్ళి, మహాత్మాగాంధిని దర్శించి, కొంత మనశ్శాంతిని బడశారు. తరువాత ఆయన మద్రాసుకు తిరిగి వచ్చి రాజకీయ రంగానికి కాకుండా కళారంగానికి తన జీవితం అంకితం చేయడానికి నిశ్చయించుకున్నారు. ఫిల్మ్ కంపె నీలు పెడతామంటూ బయలుదేరిన ప్రబుద్ధులు కొందరు ఆయనను బుట్టలో వేసుకుని, ఆయన జేబులో ఉన్న డబ్బుల్ని ఖాళీ చేశారు.

చేతిలో ఆయనకు చిల్లిగవ్వలేదు. చేయిచాచి యిం కొకరిని ముష్టి అడిగే స్వభావంకాదు ఆయనది. దాంతో ఆయన క్షుద్బాధకులోను కావలసి వచ్చింది. ఒకరోజున స్మృతిలేకుండా ఆయన నుంగంబాకంలో పడిపోయారు. ఆ దారిన వెడుతున్న హచ్చిన్స్ అండ్ కంపెనీ అధినేత శ్రీ అచ్యుతనాయుడు తన పాతస్నేహితుడు శ్రీనాగయ్యను గుర్తుపట్టి. అశ్రుపూరిత నయనాలతో ఆయన శ్రీనాగ య్యను దేవరాజ మొదలి వీధిలో ఉన్న సర్దార్ భవన్ హోటల్‌కు తీసుకుపోయి. అక్కడ ఆయనకు భోజన వసతులను తన డబ్బుతో కలుగజేశాడు.

నాయుడు సహకారంతో శ్రీనాగయ్య ఎన్నో గ్రామ ఫోను రికార్డులను యిచ్చారు. హెచ్. ఎమ్. వి. వాళ్లు ఆయన కంఠ మాధుర్యానికి ముగ్ధులయి తమ కంపెనీలో ఆయనకు సంగీత దర్శకత్వ పదవినిచ్చి, ఆయనను

అందల మెక్కించారు ! ఆయన కమ్మని కంఠం గ్రామ ఫోను రికార్డులద్వారా ఆంధ్రదేశమంతటా ప్రతిధ్వనించింది. "మేల్ మేల్ మేలొర ఓ బాలిక" గీతం రికార్డు ఆ రోజుల్లో వేడిర్రొట్టెలాగా మార్కెట్లో చెలామణి అయింది. శ్రీ నాగయ్య భావ, రాగ తాళ యుక్తంగా పాడిన జావళీలు, త్యాగరాయకృతులు సంగీత కళాలక్ష్మికి వెలలేని ఆభరణాలుగా రూపొందాయి.

1935 లో శ్రీ బి. ఎన్. రెడ్డిని శ్రీనాగయ్య కలుసుకోవడం జరిగింది. బాల్యస్నేహితుడయిన శ్రీరెడ్డి శ్రీ నాగయ్యను తన వెంటపెట్టుకుని తీసుకుపోయి రోహిణీ పిక్చర్సులో భాగస్థుడయిన శ్రీ హెచ్. ఎం. రెడ్డికి పరిచయం చేశారు. శ్రీనాగయ్య విగ్రహం, కంఠమాధుర్యం శ్రీరెడ్డికి నచ్చాయి. వెంటనే ఆయనకు 'గృహలక్ష్మి' చిత్రంలో ఒక సాంఘిక సేవకుని వేషం దొరికింది. ఆ వేషంలో ఆయన పాడిన 'కల్లు మానండోయ్ బాబూ- కళ్ళు తెరవండోయ్" అన్న పాట ఆంధ్ర దేశమంతటా ప్రతిధ్వనించింది. ఆ రోజుల్లో మద్యపాన నిషేధ ప్రచారం ముమ్మరంగా జరుగుతుండడంచేత యీ పాటకు మంచి గిరాకీ వచ్చింది. 'ఆంఖియాకే ఖోల్ బాబూ' అని అమర ఆంధ్ర గాయకుడు కె. సి. డే పాడిన పాట ననుసరించి అది ఉండడంచేత ఆబాల గోపాలం శ్రీనాగయ్యను ఆంధ్రా కె సి డే ' అని పిలిచింది

తరువాత శ్రీ బి. ఎన్. రెడ్డి రోహిణి పిక్చర్సులో నుంచి భాగస్థుడుగా విడిపోయారు. స్వతంత్రంగా ఆయన ఒక సంస్థను స్థాపించారు. దాని పేరు వాహినీ పిక్చర్స్. దీనిలో శ్రీ రెడ్డి శ్రీనాగయ్యను కథానాయకుడుగాను, సంగీత దర్శకుడుగాను తీసుకున్నారు. ' వందేమాతరం ' వాహినివారి ప్రథమ తెలుగు చిత్రం. ఆ రోజుల్లో శ్రీమతి కాంచనమాలకు పెద్ద పేరుండేది. 'వందేమాతరం' లో ఆవిడ కథానాయిక. ' వందేమాతరం' చిత్రం శిల్పరీత్యా, వ్యాపారరీత్యా గొప్ప పేరు సంపాదించి శ్రీనాగయ్య ఖ్యాతిని యినుమడింపచేసింది. వెంటనే వాహినివారు ' సుమంగళి ' చిత్రం తీశారు. శ్రీనాగయ్యకు అప్పటికి ముప్ఫయిరెండేళ్లు. యువకుని వేషాలువేసి తన పేరు ప్రఖ్యాతులను ద్విగుణీ కృతం చేసుకోవలసిన శ్రీనాగయ్య "సుమంగళి ' లో డెబ్భయియేళ్ళ ముసలివాని వేషాన్ని వేయవలసి వచ్చింది. మొట్టమొదట్లో ఆయన అల్లా వెయ్యడానికి ఒప్పుకోలేదు. కాని కొంత ఆలోచించుకుని ఆయన ఆ వేషంవేసి తన ప్రజ్ఞను అగపరచదలుచుకున్నారు. శ్రీ బి. ఎన్ రెడ్డికూడా ఆ వేషం వెయ్యమని ఆయనను ప్రోద్బలపరిచారు. భగవంతుని మీద భారంవేసి శ్రీ నాగయ్య ఆ పాత్రను పోషించడం జరిగింది. దాంతో ఆయనకు బహుముఖ ప్రజ్ఞాన్వితుడయిన నటుడు (CHARACTER ACTOR) అన్న బిరుదు సినిమా ప్రేక్షక లోకంనుంచి లభించింది. పత్రికలన్నీ శ్రీనాగయ్య నటనను గురించి బ్రహ్మాండంగా రాశాయి బాబూరావు పటేల్ సంపాదకత్వంకింద బొంబాయినుంచి వస్తుండే ' ఫిల్మ్ ఇండియా ' పత్రికలో "నాగయ్య నీకేమయినా లంచం యిచ్చాడా-ఆయన్ను గురించి అంతబాగా రాశావు ' అని ఒక పాఠకుడు సంపాదకుణ్ణి ప్రశ్నించాడు. "అవును- ఆయన ఉపజ్ఞతతోకూడిన నటనను, కమ్మని గానాన్ని నాకు లంచం యిచ్చాడు. అందుకనే నేను అలా రాశాను; అని సమాధానమిచ్చాడు బాబూరావు పటేల్. ఆంగ్ల చిత్రం "గుడ్ అర్త్"లో ప్రధాన భూమికను దాల్చి అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించుకున్న పాల్ మునితో సరితూగడంచేత ఆంధ్ర సినిమా ప్రేక్షక ప్రజానీకం ఆయనకు అధికారరీత్యా "ఆంధ్రా పాల్ముని" అన్న బిరుదునిచ్చింది.

తరువాత వాహినివారి ' దేవత ' చిత్రంలో శ్రీనాగయ్య కథానాయకుని పాత్ర దాల్చారు. ఈ చిత్రం కూడా తెలుగుదేశంలో విజయఢంకా మోగించింది. "దేవత ' తీస్తున్న రోజుల్లోనే శ్రీనాగయ్య జీవితరంగం లోకి సహధర్మ చారిణిగా ఒక వనిత అడుగెట్టింది. ఆవిడ పేరు జయమ్మ. అప్పటినుంచి ఆవిడ ఆయన కష్టసుఖాలలో పాలు పంచుకుంది.

వాహినివల్ల శ్రీనాగయ్యకు, శ్రీనాగయ్యవల్ల వాహినికి పేరు, ప్రతిష్ఠలు అభివృద్ధి కాజొచ్చాయి. వాహినివారి చిత్రాలకు ఛాయాగ్రహకుడుగా ఉండే శ్రీ రామనాథ్, శిల్ప దర్శకుడుగా వ్యవహరించిన శ్రీ శేఖర్, సాహిత్యం పొదిగిన శ్రీ సముద్రాల వెంకట రాఘవాచార్యులు ఆయన ఉన్నతికి కొంతవరకు కారణ భూతులు కాగలిగారు.

వాహినివారి చిత్రాలకు అంతవరకు ప్రొడక్షన్ మేనేజరుగా పనిచేస్తున్న శ్రీ కె. వి. రెడ్డి చిత్ర దర్శకుడుగా రూపుదాల్చి శంఖం పూరించారు. మహాభాగవతం రచించిన 'భక్త పోతన ' చిత్రాన్ని ఆయన తీయదలిచారు. అంత

వరకు పౌరాణిక చిత్రాలలో కథానాయకుని వేషాలు వేస్తున్న శ్రీనాగయ్య పోతన భూమికకు (కాయం స్థూలంగా ఉండడం వల్లకూడా) పనికిరాడేమోనని కొందరు తమ అనుమానాన్ని. భయాన్ని వెల్లడించారు. కాని శ్రీ కె. వి. రెడ్డి సాహసించి శ్రీనాగయ్యకు ఆ పాత్రను యిచ్చారు. శ్రీ నాగయ్య ప్రజ్ఞ, సంస్కారాలమీద శ్రీ కె. వి. కి అమితమైన విశ్వాసం ఉంది. పోతన పాత్రలో శ్రీ నాగయ్య ఎవ రెస్టు శిఖరం ఎక్కి కూర్చున్నారు. ఆ పాత్ర పోషణలో ఆయన చూపెట్టిన హావభావాలు, ముఖ కళవళికలు ఆయ నకు అమరత్వాన్ని ప్రసాదించాయి. 'పావన గుణరామా' అన్న పాట శుద్ధ కర్ణాటక బాణీలో పాడి ఆయన అశేష ఆంధ్ర సినిమా ప్రేక్షక సముదాయం యొక్క హృదయ పీఠం అధిరోహించగలిగారు. కర్ణాటక సంగీతం సినిమా ప్రేక్షకులకు నచ్చదనే అభిప్రాయానికి ప్రచారం కలిగించిన ప్రబుద్ధులందరు 'పోతన' విజయపంతం కావడంతో సిగ్గుతో తలలు వంచుకోక తప్పిందికాదు.

నట జీవితంలో పెద్దపేరును సంపాదించిన శ్రీనాగయ్య చిత్ర నిర్మాణ రంగంలోకి పరిస్థితుల ప్రభావ, ప్రోద్బలాల వల్ల ఉరకకుండా ఉండలేకపోయారు. రేణుకా ఫిలిమ్స్ పేర ఒక సంస్థను స్థాపించి, దాని పతాకచ్ఛాయల్లో 'భాగ్య లక్ష్మి' చిత్రాన్ని తీశారు. అదొక చక్కని చిత్రమైనా వ్యాపారరీత్యా ఎద్దుకంటిని అదిసూటిగా కొట్టలేకపోయింది. తన సొంత సంస్థ బావుటాను ఒక చెంప ఎగురవేస్తూనే మరోచెంప శ్రీనాగయ్య వాహినివారి 'యోగి వేమన' లో వేమన పాత్రవాల్చి. ఆంధ్ర సినిమా ప్రేక్షక ప్రజానీక మన్నన లందుకున్నారు.

రేణుకా పతాకంక్రింద శ్రీనాగయ్య 'త్యాగయ్య' ను నిర్మించి ఒక చరిత్రను సృష్టించారు. ఆ చిత్రం స్క్రీన్‌ప్లే రాయడానికి ఆయన రాత్రి-బగళ్లు ఎంత కృషి సలిపారో చెప్పడానికి వీలుపడదు. కొంత ఉపాసనా బలంకూడా ఉండాలనే సంకల్పంతో శ్రీనాగయ్య తిరువాయూర్‌లోని త్యాగయ్య సమాధి దగ్గరకువెళ్లి, కొన్నిరోజులపాటు అక్కడ ఉపవాస వ్రతం సలిపి, ఆత్మబలాన్ని అభివృద్ధి పరుచుకున్నారు. 'త్యాగయ్య' కు శ్రీనాగయ్య దర్శకుడు: సంగీత దర్శకుడు. దానిలో ఆయన ప్రధానపాత్ర దాల్చా రని వేరే చెప్పక్కర్లేదు. 'త్యాగయ్య' చిత్రం నిర్మింప బడుతున్నప్పుడు రేణుకా శిబిరంలో సర్వకాల సర్వావస్థల లోను ఓంకారనాదాన్ని స్ఫురింపజేసే తంబూరాలు ఎడతెరిపి లేకుండా వినపడుతుండేవి. ఆ శిబిరంలోకి అడుగెట్టిన వాళ్లకు అక్కడ ఒక మహాయజ్ఞం జరుగుతున్నట్లు అగ పడేది. అల్పాహార, పూర్ణాహార విందులకు అక్కడ తక్కువలేదు. శ్రీ ఎం. సి. రాఘవన్ అధ్వర్యంకింద సాగిన భోజనశాల కవాటాలు తెలుగు సినిమా పారిశ్రామిక రంగంలోని జీవులందరికి రాత్రింబగళ్ళు తెరువబడ్డాయి. ధనవ్యయ ప్రయాసాలకోర్చి శ్రీనాగయ్య 'త్యాగయ్య'ను నిర్మించారు. దాంట్లో ఆయన నిర్వహించిన త్యాగయ్య భూమిక ఆంధ్ర సినిమా ప్రేక్షకుల హృదయ ఫలకాలమీద చెరగని ముద్రవేసింది. త్యాగయ్య చిత్రం 'యునెస్కో' అధ్వర్యాన జరిగిన అంతర్జాతీయ సంగీతోత్సవంలో పాల్గొని, భారతదేశానికి గొప్ప కీర్తి తెచ్చింది.

ఒక చెంప తెలుగు చిత్రాలలో నటించడమేకాక శ్రీ నాగయ్య తమిళ చిత్రాలలోకూడా అగపడ్డారు. 'అశోక్ కుమార్' చిత్రంలో త్యాగరాయ భాగవతర్ తండ్రిగా అగపడి ఆయన గొప్ప నటనాకౌశలాన్ని అగపరిచారు. శ్రీమతి ఎం ఎస్. సుబ్బులక్ష్మి తీసిన 'భక్తమీరా' చిత్రంలో కుంభరాణా పాత్రను అమోఘంగా నిర్వహిం చారు ఆయన. ఆ చిత్రం హిందిలోకూడా తీయబడది. 'చక్రధారి' లో ఆయన ధరించిన ప్రధానపాత్ర తమిళ సినిమా ప్రేక్షకుల జోహార్లను అందుకున్నది. 'ఎన్నై పడుంపాడు' చిత్రంలో ఆయన నిర్వహించిన జీన్ వాల్ జీన్ భూమిక ఆయనకు అఖండ కీర్తిని సంపాదించి పెట్టింది.

ఆంధ్రజాతిని భక్తిరస వాహినిలో జలకమాడించిన రామ దాసును వెండితెర కెక్కించాలని ఆయన 'భక్తరామదాసు' చిత్ర నిర్మాణానికి దిగారు. దానిలో అగపడుతున్న జంధ్యాల గౌరీనాథశాస్త్రి, డాక్టర్ గోవిందరాజుల వెంకట సుబ్బారావు, శ్రీమతి కన్నాంబ మొదలయినవారు హఠా త్తుగా కాలధర్మం చెందడంచేత చిత్ర నిర్మాణం కుంటుపడి. ఆయనకు ఆర్థిక సంబంధమయిన ఎన్నో కష్టాలను. సంక టాలను తీసుకొచ్చి పెట్టింది. పంపిణీదార్లు చామ్రియా టాకీస్‌కు ఆయనకు మధ్య మనస్పర్ధలు ఉత్పన్న మయ్యాయి. ఆయనను నిరాశ, నిస్పృహలు కొంతకాలం చుట్టుముట్టాయి.

మనశ్శాంతికోసం ఆయన పుట్టపర్తి సత్యసాయిబాబాను ఆశ్రయించారు. బాబా అధ్వర్యాన మద్రాసులో శ్రీ నాగయ్య షష్ట్యాబ్దపూర్తి మహోత్సవం ఘనంగా జరిగింది. తరువాత ఆయన జీవితంలో కొంతవెలుగు అగపడ్డది.

(తరువాయి 33 వ పేజీలో)

# తెలుగు తెరకు



డి. ఏ. యస్. ప్రొడక్షన్సువారు

యింతవరకు సమర్పించిన కాంతికిరణాలు

- మంగమ్మ శపథం
- పిడుగు రాముడు
- తిక్క శంకరయ్య
- గండికోట రహస్యం
- చిన్ననాటి స్నేహితులు
- ధనమా – దైవమా ?
- జీవన జ్యోతి

విడుదలకు సిద్ధమవుతోంది!

'జీవిత నౌక'

---

డి. వి. యస్. ప్రొడక్షన్సు

91, గోపతి నారాయణస్వామి చెట్టి రోడ్, మద్రాసు-600 017.

# అమరజీవి మా నాగయ్య బావ

రచన
నటయోగి. మదిగొండ లింగమూర్తి

కీర్తి శేషులు శ్రీనాగయ్యబావ చిరస్మరణీయంగా వుండా లన్న భావంతో ఆయన రూపాన్ని కంచు విగ్రహ ప్రతిష్ఠా పన సందర్భంలో సావనీరు వేయిస్తున్నామని, అందుకు నన్నొక వ్యాసం వ్రాసి యివ్వమని కోరారు శ్రీ ఇంటూరి. సినిమా రంగం వదిలి యెనిమిది సంవత్సరాలు అయింది. మరో ప్రపంచంలో పయనిస్తున్నాను. ఇట్టి స్థితిలో నన్ను తిరోగమనం చేయించకండి అని సవినయంగా సమాధానం చెప్పాను. కాదు కూడదన్నారు. వ్రాసి తీరాలన్నారు. నటులుగాను, వ్యక్తులుగాను, మీరిద్దరు సన్నిహితులు గనుక మీరు వ్రాయండని కొంతవరకు బలవంతమే చేశారు. ఇరుకునపడినాను. మా బావకు యీకంచు విగ్రహ ప్రతి ష్ఠాపనకోసం శ్రీ ఇంటూరి పడిన శ్రమ సామాన్యమైనది కాదు. ఎన్నో ప్రతి ఘటనలను యెదుర్కొన్నాడు. తుదకు సాధించాడు అటువంటి మిత్రుని మాట కాదన టం అపరాధం అనిపించింది.

మా బావ నటన గురించి క్లుప్తంగా వ్రాయమన్నారు. ఇది సాధ్యమా? ఆత్మతత్వాన్ని క్లుప్తంగా చెప్పమన్న ట్లుగా ఉంది. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. తెలుగే కాక హిందీ, తమిళము, కన్నడ చిత్రాలలో పాల్గొన్నాడు. అవి కొన్ని వందల చిత్రాలుంటాయి. అవి అన్నీ నాకు జ్ఞాపకంరావు. ఆ చిత్రాలలో ఆయన నటించారు. ఆయన ధరించిన పాత్రలన్నీ అంతేనా? కాదు. ఎందుకు కాదు?

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అని పరమాత్మ అన్నాడు. అలాగే జ్ఞానమూర్తులు ముగ్గురు.

ఒకరు భాగవత రచయిత, మహాభక్తుడు, జ్ఞాని అయిన పోతనామాత్యుడు.

రెండవవాడు యోగివేమన. కాంతాకనకాలలో ఆనందం లేదని అనుభవ పూర్వకంగా తెలుసుకొని, యోగంతో సాధించి, సచ్చిదానంద స్వరూపాన్ని తెలుసుకొని, ఆ అనుభూతితో ప్రజాకోటికి జ్ఞానభిక్ష పెట్టిన మహాత్ముడూ, మాయనే మాయంచేసిన మహాయోగి వేమన.

సంగీతంతో శ్రీరామానుగ్రహం పొంది దివ్యానుభూతిని కీర్తనలుగా రచించి తరతరాల వారు తరించటానికి మార్గ దర్శకుడైన పుణ్యమూర్తి త్యాగయ్య.



అట్టి చరితాత్ములను ప్రజాకోటి స్మరించటానికి ఒక్కటే మార్గం. చలన చిత్రాలుగా రూపొందించటమే. ఆ మహా యజ్ఞానికి ప్రథమ తాంబూలం వాహినీ వారికే దక్కింది. భక్త పోతన చిత్రనిర్మాణానికి అన్ని హంగులు సిద్ధమైనాయి. ఆ చిత్రానికి దర్శకుడుగా కీర్తిశేషులు శ్రీ కె. వి. రెడ్డిని నియమించారు. అదే వారి ప్రథమ దర్శకత్వంకూడా. ఉత్తమ సంస్కారి, జ్ఞాని అయిన కీ. శే. శ్రీ సముద్రాల రాఘవాచార్యులు రచన చేశారు. మా అందరికీ పూజ్యులైన శ్రీ రామనాథ్, శేఖరులు సహకరించారు.

అన్ని శాఖలలోనూ సహకరించిన ముఖ్యులు యిద్దరు న్నారు. ఒకరు శ్రీ కమలాకర కామేశ్వరరావు, రెండవ వారు 'నేను'. ఇంకా ఎందరో సహకరించారు.

పోతన పాత్రకు ఎవరిని నియమించటమా అనే ఆలోచన తీవ్రమైన సమస్యగా పరిణమించింది. పోతన ఒక పేద రైతు గనుక బక్కచిక్కినవాడుగా వుండాలని ఒకవాదన. 'రైతు అయినంత మాత్రాన బక్కచిక్కిన

వాడుగా వుండాలన్న వాదన సహేతుకంగా లేదు: మనం చూపించే పోతన రైతు మాత్రమే కాదు, మహాభక్తుడు, జ్ఞాని అయినవాడు. ఆ నటుని సామర్థ్యము స్వరూపము ప్రధానమని' కొందరి వాదన.

తుదకు ఆ పాత్రను శ్రీ నాగయ్య చేతనే వేయించటానికి నిర్ణయించబడింది. ఆ వేషాన్ని వేయాలన్న అభిలాష ఒక వైపు, తలబోడి చేయించుకోవలసి వస్తుందే అన్న బాధ మరోవైపుతో కొంతకాలం సందిగ్ధంలో పడ్డాడు మా బావ. 'భక్తపోతన' చిత్రం షూటింగు మొదటిరోజు రానే వచ్చింది. ఆ రోజు ఉదయమే క్రాపింగ్ తీయించి. స్నానం చేయించి. స్టూడియోకు తీసుకువెళ్ళాను. ఆయనను మేకప్ రూములోకి తీసుకెళ్ళి కుర్చీలో కూర్చోబెట్టాను. ముఖానికి రంగుపూయటం ఆరంభమైంది. నేను ప్రక్కనే కూర్చొని ఆయనను నవ్వించటానికి ప్రయత్నిస్తున్నాను. కాని, మా బావ పలకటంలేదు. క్రాపింగ్ తీయించానని నా మీద కోపం వచ్చిందేమో అని అనుకున్నాను. ఒక గంటలో వేషం పూర్తి అయింది. ఆయన ముఖంలోకి చూశాను. మా నాగయ్యకాదు. ఆ రూపమేలేదు. ఏదో కొత్త తేజం కనబడింది. వస్త్రధారణ జరిగిన తర్వాత మరోసారి ఆయన స్వరూపాన్ని పరీక్షగా చూశాను. నా ఒళ్ళు జలదరించింది. సెట్టులో ఉన్న డైరెక్టర్ కె. వి.ని పిలిపించాను. ఆయన వచ్చి చూశాడు. విస్మయం పొందాడు. ఆనాటి భక్తపోతనే ఇతగాడిని ఆవహించాడా! అన్న సందేహం కలిగింది. కర్పూర హారతి ఇచ్చాము. కొబ్బరికాయ కొట్టాము. సెట్టులోకి తీసుకువెళ్ళాము. ఆ మందహాసమే! ఆదివ్యతేజమే! ఆ ముహూర్తంనుంచి ఆ చిత్రం కడవరకు అదే రీతిలో ఉన్నాడు. షూటింగ్ సమయంలో ఫలహారం చేయటం కానీ, భోజనం చేయటంకానీ లేదు. ఇతర ప్రసంగం కూడలేదు. అలాగే యోగి వేమన, త్యాగయ్య చిత్రాల లోని పాత్రలుకూడా అదేవిధంగా రూపొందాయి. ఆ మూడు చిత్రాలలో ఆయనతో నేనూ కలిసి వేషాలు వేయటంవల్ల కలిగిన అభిప్రాయం ఒక్కమాటతో చెప్తున్నాను. శ్రీ నాగయ్య ఆ పాత్రలు నటించలేదు. ఆ పాత్రలే ఆయనను ఆవహించి ఆయనలో ప్రతిబింబించాయి. అందుకనే మూడు చిత్రాలు ఆంధ్ర చలన చిత్రరంగానికి ఆణిముత్యాలు.

" నభూతో నభవిష్యతి "....

భవిష్యత్తులో కూడా ఆ చిత్రాలు రావు. రావటానికి అవకాశం కూడాలేదు. వాటిని నిర్మించగల సమర్థులగు నిర్మాతలు లేరనికాదు. నటులు లేరనీకాదు. కానీ, ఆ మహాత్ముల ఆత్మలు మరి ఎన్నేళ్ళకోకదా ఆవిర్భవించేది!

ప్రభుత్వానికి, ముఖ్యంగా మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారికి ఒక విజ్ఞాపన చేస్తున్నాను. 'పోతన', 'వేమన', 'త్యాగయ్య' చిత్రాలకు కాపీలు తీయించి ప్రభుత్వ యాజమాన్యంలో ఉంచితే తరతరాల వారు చూచి తరిస్తారు. తద్వారా మా నాగయ్య బావ అమరుడు అవుతాడు.

మా నాగయ్య బావ తర్వాత వయస్సు అనే "క్యూ"లో ఉన్న మొదటివాడిని నేనే గనుక నాగయ్యగారి విగ్రహ ప్రతిష్ఠాపన సందర్భంలో కృపచేసిన వారికి, ఆర్థికంగా సహాయపడిన తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్‌వారికి, తమిళ, ఆంధ్ర ప్రభుత్వాలవారికి, సభకు విచ్చేసిన రసహృదయులకు, ముఖ్యంగా చిరంజీవి ఇంటూరికి నా కృతజ్ఞతను తెలుపుకుంటున్నాను. సర్వేజనాస్సుఖినోభవంతు!.



# చివరకు మిగిలింది శిలావిగ్రహం

రచన: ఎం. సత్యం (జైహింద్ స్టూడియో)

అది 1942 సంవత్సరం. ద్వితీయ ప్రపంచ సంగ్రామ రేశికి సంబంధించిన భేరీ ఒక చెంప మోగుతోంది. మద్రాసులో ఉన్న తెలుగు కంపెనీలన్నీ మూటా, ముల్లె సర్దుకొని ఆంధ్ర ప్రాంతాలకు పరుగులు తీస్తున్నాయి. సారథి శిబిరంలో నెలకు యిరవై రూపాయల జీతంమీద స్టిల్ కెమెరామన్‌గా పనిచేస్తున్న నాకు మద్రాసును విడిచి పెట్టి వెళ్ళిపోవడానికి మనస్కరించలేదు.

పూజ్యులు శ్రీ గూడవల్లి రామబ్రహ్మం యిచ్చిన ఉత్తరంచేత పుచ్చుకొని 'భాగ్యలక్ష్మి' చిత్రం తీస్తున్న రేణుకావారి గుడారంలోకి అడుగెట్టాను. సహజమైన చిరునవ్వు ఒలికే ముఖంతో ఒక పవిత్రమూర్తి నన్ను లోపలికి ఆహ్వానించి, నేను యిచ్చిన ఉత్తరాన్ని చూశారు. దయతో కూడిన తన చూపును నామీద సారించి 'యీ రోజుల్లో యిరవయి రూపాయిలు ఏ మూలకు నాయనా-నేను నెలకు నలభై రూపాయిలు జీతం యిస్తా-నా దగ్గరే ఉండి పో' అన్నారు. ఆయన మాటవిని నేను విస్తుపోయాను. ఏకోదమ్మున నా జీతాన్ని యిరవైనుంచి నలభై చేసిన ఆ మహనీయునికి మనసారా దండం పెట్టాను. హఠాత్తుగా యిల్లా పెరిగిన జీతాన్ని జీవితావసరాలకు ఎల్లా వాడుకోవాలా అన్న మీమాంస నా బుర్రను ఆ క్షణంలో తొలిచి వేసిందంటే మీరు నమ్మాలి. నా జీవితసౌధపు మరోమెట్టును అల్లా ఎక్కించిన ఆ మహనీయుడు శ్రీ చిత్తూరు వి. నాగయ్య అని నేను మీకు వేరే చెప్పక్కర్లేదు. వారి శిబిరంలోనే ప్రప్రథమంగా పూజ్యులు శ్రీ పి. పుల్లయ్య దర్శన భాగ్యం లభించడం నా అదృష్టం.

నన్ను చూచినప్పుడల్లా 'నాయనా సత్యం' అన్నది శ్రీనాగయ్య నాభినుంచి వచ్చిన మాట. ఆ మాటలో ఎంత మాధుర్యం, ఎంత వాత్సల్యం. ఎంత ఆప్యాయత తొణికిసలాడేవి!....యజమాని, సేవకుడు-వీరిద్దరి మధ్య ఉన్న వ్యత్యాస భావం ఆయన జీవిత నిఘంటువుకు కొత్త పదం. మిన్ను విరిగి మన్నుమీద పడ్డా ఆయనలోని ఆత్మ విశ్వాసం చలించేదికాదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు ఆయన అతీతుడు. 'అలుగుటయే ఎరుంగని మహామహితాత్ము డజాతశత్రువే అలిగిన నాడు సాగరములన్నియు ఏకము కాకపోవు' అన్న పద్యానికి ఆయన ప్రత్యక్ష సాక్ష్యం.



నటుడుగా ఆయన ఎవరెస్టు శిఖరాగ్రానికి ఎగబాకిన మనిషి. పోతన, వేమన, త్యాగయ్య, రామదాసు పాత్రలను పోషించడంలో ఆయన అగపరిచిన హావభావాలు అమృత గుళికలు. బహుముఖ ప్రజ్ఞకల ఆ నటునకు ఎల్లాంటి పాత్రపోషణ అయినా నల్లేరుమీద బండి నడక.

దానం చేయడంలో కర్ణుడు, దధీచి, శిబిలాంటి పేర్లను మనం పురాణాలలో విన్నాం. ఆ పౌరాణిక వ్యక్తులతో తులతూగగల దర్మదాత శ్రీ నాగయ్య. ఆయన శిబిరంలోకి అడుగెట్టినవాళ్లు ఆయన గుప్తదానాలను రుచిచూడకుండా బయటికి రాలేదని ప్రజా వాక్కు.

కర్ణాటక, హిందూస్థానీ సంగీతాలలో ఆయన పరిజ్ఞానం అసామాన్యం. శ్రోతలమీద సమ్మోహనాస్త్రాన్ని సంధించే ఆయన గానం అమృతరసాన్ని విరజిమ్మేదనడంలో అతిశయోక్తికి యే మాత్రం తావులేదు. నాయకుడుగా ఆయన పట్టు తప్పి దివినుంచి భువికి ఊడిపడ్డ గంధర్వ గాత్రుడని నా భావన.

దక్షిణ భారత సినిమా ప్రపంచంలో 'తారాబలం' ఆయనతోనే పుట్టింది. ఆయనతోనే పెరిగింది. తన

(తరువాయి 32 వ పేజీలో)

విఖ్యాతి కెక్కిన నటులు, గాయకులు, సంగీత దర్శకులు, దర్శకులు,
చిత్ర నిర్మాత స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య కాంస్య
విగ్రహం మద్రాసులోని పానగల్ పార్కు ఈశాన్య
భాగంలో తెలుగు సినీ ఆర్టిస్టుల అసోసియేషన్
చేత ప్రతిష్ఠింపబడుతున్న సందర్భంలో
ఆ మహామహుని దివ్యస్మృతికి మేము
అంజలి ఘటిస్తున్నాము.



# విజయచిత్ర

(ప్రముఖ సినిమా మాస పత్రిక)

ఆర్కాట్ రోడ్, మద్రాసు - 600026

# SRI NAGAYYA - THE EMINENT ARTISTE


*BY*

**Sri P. RANGA REDDI,**
**Minister for Finance & Information**
**Government of Andhra Pradesh.**


Telugu cinema has the good fortune of having many famous artistes who brought glory to Telugu Films. Some of them have become legends in their own life time. Among these eminent artistes special mention must be made of Late Chittoor V. Nagayya. He had carved for himself a niche in the history of Telugu Cinema.



It is no exaggeration to say that Nagayya's portrayal of devotional roles like Thyagayya, Potana, Vemana, Ramadas etc., can never be excelled by any other artiste. His melodious voice had lent charm and beauty to the roles he had depicted on the screen. Once he stood before the camera, he forgot himself and became merged with the role he was enacting. The cinegoer felt that he was not seeing Nagayya enacting a role but he felt as if he was in the presence of Potana or Vemana or Ramadas. The sincerity with which Nagayya devoted himself to his profession should be the ideal for today's up and coming actors and actresses.

Late Nagayya did not confine his acting to devotional films only. He was equally at home in films with social themes. Particular mention must be made of his memoraable roles in social films, like Grihalakshmi-Vandemataram, Sumangali, Devata, Swargaseema, Naa Illu etc. In those days, he was considered to be the most handsome hero who sang his own songs which became hits. He had the fortune of working under eminent directors like B. N. Reddy, H. M. Reddy and K. V. Reddi. Nagayya was himself a director of repute. Many critics considered him as a film maker of very high standards.

Among the various other talents of Nagayya, his music direction was highly appreciated by lovers of music. He was a thorough master of both classical and light music.

Cinema actors are believed to roll in wealth. There is some justification for this belief if we look at the life styles of some of the stars of today. But, in the case of Nagayya, though he earned a lot of money, he did not care for a life of pomp. No one who saw him would think that he was a leading film star of the day. Instead of wasting his enormous income on a life of ostentation, he spent his money for chartitable purposes. There are many people in the film industry and outside who remember him with gratitude, for the help received from him. The result of all this was that he had to lead his last days in financial difficulties.

Nagayya was an ardent nationalist. He took an active part in our freedom struggle. He had to pay heavy penalties for identifying himself with the movements of labour. Besides being a freedom fighter, he also came to the aid of the families of many national leaders when they were languishing in prisons.

More than any thing else late Nagayy- will be remembered as a man of modesty and sympathy to his fellow beings. He was an inspiration for many artistes of his day. People like him are born once in a long time. It is our duty not only to cherish his memory but also to walk in his footsteps.

# THE ANDHRA BANK LTD

## Kalpataruvu Deposit

*A Unique scheme to multiply your Savings*

**UP TO 20 TIMES**

**An ideal scheme to save for specific purposes such as:**

- DAUGHTER'S WEDDING
- HOUSE BUILDING
- CHILDREN'S HIGHER EDUCATION

**Join our scheme and see how your Money Multiplies with Time**

| Invest | Receive | In months |
|---|---|---|
| Rs. | Rs. | Rs. |
| 4,999.39 | 1,00,000 | 361 |
| 8,294.07 | 1,00,000 | 300 |
| 13,646.27 | 1,00,000 | 240 |
| 36,941.00 | 1,00,000 | 120 |

# THE ANDHRA BANK LTD

*CENTRAL OFFICE:* HYDERABAD.

O. SWAMINATHA REDDY
*CHAIRMAN*

# స్మృతివీచిక

రచన డాక్టర్. దాశరథి.



మనం యెవ్వరం చూడని వాడు త్యాగయ్య
త్యాగయ్యను తనలో చూసిన వాడు నాగయ్య

అతనిలో వుంది త్యాగయ్య సంగీతం
అతని హృదయం కమనీయ నవనీతం

లక్షలాది ప్రేక్షకులను ముగ్ధుల నొనరించినవాడు
అక్షులలో నుండి అశ్రువులు తొనికించ గలిగినవాడు

చలన చిత్రరంగ చరిత్ర రచించేవాడు
నాగయ్యకు అగ్రస్థానం ఇవ్వకుండా వుండలేడు

పోతన్నను చూపించాడు, వేమన్నను చూపించాడు
రామదాసును చూపి ప్రజలను మెప్పించాడు

మహానటుని నాగయ్యను మరచిన వాడు
మనసున్న తెలుగువాడని అనిపించుకోలేడు

హృదయ సింహాసనంపై నాగయ్యను ప్రతిష్ఠించండి
యెల్లకాలం మరువక ఆయనను స్మరించండి

## చివరకు మిగిలింది...........

(28వ పేజి నుంచి)

జీవితకాలంలో ఆయన లక్షలకు లక్షల రూపాయలు ఆర్జించారు. అడిగిన వాడికి లేదనకుండా వాటిని ఆయన యిచ్చివేశారు. ఎన్నో సంస్థలు, వ్యక్తులు యీ సత్యానికి సాక్షులు. జీవితంలో భౌతిక సంబంధమైన సౌఖ్యాలను అనుభవించడంకోసం ఆయన ఒక చిల్లిగవ్వనైనా వెనకాల వేసుకోలేదు. ఆర్జించిన డబ్బును కూడబెట్టుకున్నట్టయితే ఆయన దానితో లక్షణంగా త్యాగరాయనగర్ నంతా కొనేసి 'కింగ్ ఆఫ్ త్యాగరాయనగర్' అని విఖ్యాతి కెక్కేవారు. కారణజన్ముడవడంచేత ఆయన మూరని పైసానుకూడా తన వద్ద మిగుల్చుకోకుండా మబ్బుల్లో కలిసిపోయారు. ఆయన భౌతిక కాయం అనంత వాయువులో లీనమైనా ఆయన స్మృతి శిలావిగ్రహ రూపంలో త్యాగరాయనగర్ పానగల్ పార్కువద్ద ప్రతిష్ఠితమవుతోంది.

సామాన్యుడు సత్యం ప్రతినిత్యం సాష్టాంగదండ ప్రణామం చేయడానికి అనువుగా నాగయ్య శిలావిగ్రహాన్ని త్యాగరాయనగరులో-మంగళ తూర్యారావాల నడుమ-ప్రతిష్ఠించిన నాగయ్య స్మారక నిధి కార్యదర్శి, గురుతుల్యులు శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావును, మద్రాసులోని తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ కార్యకర్తలను నేను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నా. 'ఎందరో మహానుభావులు, అందరికీ వందనములు' అని ఆలాపించిన ఆ 'మహానుభావుని' శిలావిగ్రహమే మనకందరికి చివరికి మిగిలిన స్థిరాస్తి.

# నటలోకానికి మకుటంలేని మహారాజు నాగయ్య

(24 వ పేజీనుంచి)

చామ్రియావారు శ్రీ సుందరలాల్ పర్యవేక్షణకింద 'రామదాసు' చిత్రాన్ని ఎల్లాగో పూర్తిచేసి బయటపడే వారు. కాని శ్రీ నాగయ్య ఆశించిన ప్రమాణం ఆ చిత్రంలో అగపడవానికి అవకాశం లేకపోయింది.

తరువాత ఆయన 'సమ్మరి మొల్ల'. 'యశోద కృష్ణ' చిత్రాలను తీయడానికి శంఖం పూరించారు. కాని ఆయన ప్రయత్నాలన్నీ కొనసాగకుండాపోయాయి. దెబ్బమీదదెబ్బ తగలడంతో ఆయన మరీ కుంగిపోయారు. పూర్వం ఆయన చేసిన అప్పులన్నీ—కాంపౌండ్ వడ్డీలతో కలుపుకొని కొన్ని లక్షల రూపాయిలకు దిగాయి. చామ్రియావారు. ఆయన 'రామదాసు' చిత్ర నిర్మాణ విషయంలో న్యాయ స్థానానికి ఎక్కక తప్పలేదు.



చిత్ర నిర్మాతగా ఆయన బావుటా కిందికి దిగినా నటుడుగా ఆయన కీర్తి పతాకం మరింత పైకిపోయింది. 1965 లో భారత ప్రభుత్వం ఆయనకు 'పద్మశ్రీ' బిరుదు నిచ్చి గౌరవించింది. దక్షిణ భారత సినిమా లోకంలో ప్రప్రథమంగా యీ బిరుదును స్వీకరించినవారు శ్రీనాగయ్యే అని మనం జ్ఞాపకం పెట్టుకోవాలి.

ఒక చెంప ఆర్థిక బాధలు హెచ్చవడం. మరో చెంప ఆరోగ్యం చెడడం ఆయన మనోవ్యాధికి దోహదం చేకూర్చాయి. మూత్ర సంబంధమైన వ్యాధికి గురయి ఆయన మద్రాసులోని రంగభాష్యం నర్సింగు హోంలో చేరి. అక్కడ ఒక నెలరోజులపాటు చికిత్సనందారు. ఆ రోజుల్లోనే ఒక తెలుగు చిత్రంలో మిగిలిన తన పాత్రను పోషించడంకోసం డాక్టరును వెంటపెట్టుకొని అవుట్‌డోర్ షూటింగు కార్యక్రమానికి హాజరయ్యారు. దాంతో ఆయన మరీ డీలాపడిపోయారు.

తిరిగి ఆయన నర్సింగ్‌హోంలో ప్రవేశించవలసి వచ్చింది. మూత్రవ్యాధి తీవ్రతరంగా ఉందని గ్రహించిన డాక్టర్లు ఆయన్ను అడయార్‌లోని వి. హెచ్. ఎస్. సెంటర్‌కు చేర్చారు. మృత్యుదేవతతో ఆయన రెండు గంటలసేపు భీషణ సమరం సలిపారు. ఆయన అవసాన దశ సమీపిస్తున్నదని తెలుసుకొని మృత్యుశయ్య దగ్గిర ఉన్న యీ రచయిత. శ్రీ ముదిగొండ లింగమూర్తి 'రఘుపతి రాఘవ రాజారాం' గీతం పాడుతోంటే ఆ మహానటుడు. కళాతపస్వి శాశ్వతంగా కన్ను మూశారు.

తన ముప్పయి ఏడేళ్ల సినిమా జీవితంలో శ్రీనాగయ్య 160 తమిళ చిత్రాలలోను. 200 తెలుగు. కన్నడ. మలయాళ. హిందీ చిత్రాలలోను నటించారు. వీటిల్లో ఆయన ప్రధాన భూమికలలో అగపడ్డవి సగందాకా ఉంటాయి. వీటిల్లో నాలుగోవంతు శతదినోత్సవాలు. రజితోత్సవాలు చేసుకున్నాయి.

ఆయనకు 'ఉత్తమ నటుడు'గా ఫిల్ముబాలట్‌లో ఎన్నుకున్న ప్రథమ గౌరవం 1939లో ఆంధ్రా ఫిల్మ్ జర్నలిస్టు అసోసియేషన్‌కు లభ్యమయింది. 'జర్నలిస్టులు నాకు జీవం పోశారు' అని ఆయన సందర్భానుసారంగా అంటుండేవారు.

శ్రీనాగయ్యకు తెలుగు దేశంలో జరిగిన సన్మానాలు-భారతదేశంలో మరేనటుడికీ-ఆ మాటకొస్తే అంతర్జాతీయంగాకూడా-జరిగుండవని నేను చెప్పడానికి సాహ

సిస్తున్నా. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, ఆంధ్ర నాటకకళా పరిషత్తు, తమిళ సంగీత నాటక అకాడమీ మొదలయిన సంస్థల అధినేతలు, తిరువాన్కూరు, నైజాం, మైసూరు సంస్థానాధీశ్వరులు ఆయన్ను గొప్పగా సన్మానించారు. కోనసీమలోని పండిత ప్రకాండులందరు సమావేశమయి, ఆయనమీద వేదోక్తంగా సేసలు చల్లారు. లెక్కవేస్తే శ్రీనాగయ్యకు సభలలో, సన్మానాలలో 500 కాలువలకు తక్కువలేకుండా లభ్యమై ఉంటాయి. వెండి, బంగారు బహుమతులకు లెక్కలేదు. పారితోషికాలలో చాలభాగం మార్వాడీ షాపులలోకి వెళ్ళితే కాలువలలో చాలభాగం పండితులకు, అభాగ్యజీవులకు దక్కాయి.

చిన్నప్పటినుంచి కష్టజీవితం అనుభవించిన శ్రీనాగయ్య హృదయం దయార్ద్రం కావడంలో ఆశ్చర్యంలేదు. ఆయన సంపాదించిన డబ్బంతా దానాలకు, ధర్మాలకు వెళ్ళిపోయింది. తెలుగుదేశంలో కొన్ని వందల సంస్థలకు శ్రీనాగయ్య గుప్తదానాలు చేశారు. ఈ దానాలకు, ధర్మాలకు లెక్క, డొక్క ఎక్కడా కనపడదు. 'నాగయ్యగారూ—మీరు మా సంస్థకు ఫలానప్పుడు యింత డబ్బు యిచ్చారు' అని ఎవరైనా చెబితే తప్ప ఆయనకు తెలియదు. ఆయన నిజంగా అపర దధీచి. ఆయన కుడిచేతినుంచి వెళ్ళిపోయిన డబ్బు ఎడమచేతికి ఏమాత్రం తెలిసేదికాదు.

భారత చలన చిత్రరంగంలో భక్తుల వేషాలను పోషించడంలో విష్ణుపంత్ పాగ్నిస్‌కు గొప్ప పేరుండేది. ఆ మహానటుడే శ్రీనాగయ్య పోతనపాత్ర పోషణను చూచి పరవశుడై ఆయనకు ప్రణామం సలిపాడు. ఆయన పోతన, వేమన పాత్రలను చూచి ఒక హరిజన బాలుడు-గొర్లను కాచుకునేవాడు- భక్తిభావాన్ని అలవరచుకొని-ముమ్మిడివరం బాలయోగిగా రూపాంతరంపొందిన విషయం మనం మరచిపోకూడదు. తెలుగు దేశంలోని కొన్ని కేంద్రాలలో భగవద్భక్తులందరు ఆయనకు సాష్టాంగదండ ప్రణామాలు సలిపి, ఆయన్ను ఒక మహాయోగిగా పూజించిన ఘట్టాలు యీ రచయిత కళ్లారా కాంచడం జరిగింది.

శ్రీనాగయ్య విశేషంగా కాబూలీ వాళ్ళవద్ద, మార్వాడీల వద్ద అప్పులు చేసేవారు. ఒకసారి ఒక మార్వాడీ సేట్ వద్ద శ్రీనాగయ్య తన అభిమానులు తనకు భక్తి పూర్వకంగా యిచ్చిన సీతారామలక్ష్మణ వెండి విగ్రహాలను కుదువపెట్టి అప్పు తీసుకొచ్చారు. ఆ సేట్ భార్యకు హఠాత్తుగా కడుపునెప్పి పట్టుకుంది. "ఈ విగ్రహాలను తీసుకువెళ్ళి నాగయ్యగారికి యిచ్చివెయ్యి" అని ఆవిడ పట్టుపట్టింది. మార్వాడీ సేట్ వాటిని శ్రీనాగయ్యకు తిరిగి యిచ్చివేసి, యింటికి వెళ్ళేనరికి ఆయన భార్య ఎప్పటిలాగా ఉంది. విగ్రహాలు తన యింట్లోనుంచి వెళ్ళిపోయినప్పటినుంచి ఉపవాసం సలుపుతున్న శ్రీనాగయ్య శ్రీరాముణ్ణి ఒక్కమారు తలుచుకొని ఉపవాస వ్రతాన్ని విరమించారు.



'భాగ్యలక్ష్మి' తీస్తున్న రోజుల్లో శ్రీనాగయ్య తన కారును స్వయంగా డ్రైవ్ చేస్తున్నారు. కారు మంచి వేగంమీదపోతోంది. హఠాత్తుగా ఒక కుక్కవచ్చి ఆయన కారుకిందపడి చచ్చిపోయింది. దయార్ద్ర హృదయుడయిన శ్రీనాగయ్య ఆ ఘోర దృశ్యాన్ని చూడలేకపోయారు. ఆ కుక్కకు తిలోదకాలొసగి, దాని పేర చుట్టుపక్కలనున్న కుక్కలన్నిటికి శ్రాద్ధపు విందును యిచ్చారు. ఆనాటినుంచి ఆయన కారును స్వయంగా 'డ్రయివ్' చేయడం మానివేశారు.

సభావేదికల మీదినుంచి ఆవేశంతో తాను ప్రకటించిన విరాళాలు యివ్వడంకోసమే శ్రీ నాగయ్య విశేషంగా అప్పులు చేయవలసి వచ్చిందన్న విషయాన్ని మనం విస్మరించకూడదు. నఖశిఖ పర్యంతం ఆయన నటుడు కావడం చేత ఆయనకు వ్యాపార సంబంధమైన లౌకిక వ్యవహారాలు యేమాత్రం తెలియవు. వ్యాపారరంగంలో

ఆయన ఎన్నో మోసాలకు గురి అయ్యారు. ఆయన వద్ద వేలకు వేల రూపాయిలు డబ్బు తిన్న వాళ్ళే ఆయన్ను వెన్నుపోటు పొడిచారు. అయినప్పటికీ ఆయన అలాంటి వాళ్లను గురించి పల్లెత్తు మాట కూడా మాట్లాడే వారుకారు. వాళ్లు తమ యింటికొస్తే "చంపదగిన యట్టి శత్రువు తన చేతచిక్కెనేని పొసగమేలుచేసి పొమ్మనుటేచాలు విశ్వదాభి రామ వినురవేమ" అన్న పద్యాన్ని మనస్సులో వల్లించు కుని వాళ్లను సగౌరవంగా ఆదరించేవారు.



ఆయన యిల్లు ఊభాస్తులకు పర్సులు పోగొట్టుకున్న వాళ్లకు యాత్రస్థలం. పొద్దున్నే వాళ్లంతా ఆయన ముందు ప్రత్యక్షమయ్యేవాళ్లు. ఆయన పర్స్' పరిపూర్ణంగా ఖాళీచేసే దాకా ఆయనను వాళ్లు వదిలే వాళ్లు కారు.

రాజకీయ నాయకులకు, సాంఘిక ఉద్యమాలలో తిరిగే వాళ్లకు ఆయన యిచ్చిన భూరివిరాళాలు లెక్కలేదు. ఆంధ్ర రాష్ట్రావతరణ సందర్భంలో శ్రీ నాగయ్య ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుకు అప్పుతెచ్చి యిరవై వేల రూపాయి లివ్వాటంచే మీరు నమ్మాలి. విద్యార్థి దశలో ఆయన సాయాన్ని చవిచూచి. యీనాడు గొప్ప స్థితిలో ఉన్నవాళ్లు తెలుగు దేశంలో అసంఖ్యాకంగా ఉన్నారు.

సినిమా నటులంటే ప్రేక్షకులు చాలా చులకనగా చూస్తుంటారు. తమమాటల్లో వాళ్లు 'రామారావుగాడు, నాగేశ్వరరావుగాడు, జగ్గయ్యాగాడు' అని అంటుంటారు. ఒక్క శ్రీ నాగయ్యనే వాళ్లు 'నాగయ్యగారు' అని పిలుస్తూ, ఆయన పట్ల వాళ్లు అమితమయిన భక్తిభావాన్ని అగ పరుస్తుండే వారు.

'గృహలక్ష్మి.' 'వందేమాతరం.' 'సుమంగళి.' 'దేవత.' 'పోతన.' 'వెంచులక్ష్మి'. 'స్వర్గసీమ.' 'త్యాగయ్య.' 'యోగివేమన.' 'బీదలపాట్లు.' 'మనదేశం.' 'నా యిల్లు.' 'అనార్కలి,' 'నాగపంచమి.' 'ముద్దుబిడ్డ.' 'నల-దమయంతి.' 'పాండురంగమహాత్మ్యం.' 'సంపూర్ణ రామాయణం' 'ముందడుగు' 'శాంతినివాసం.' 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం.' 'భక్తశభరి.' "సీతారామ కల్యాణం" "భక్త జయదేవ్" "పదండి ముందుకు" "శ్రీకృష్ణార్జున యుద్ధం" "లవకుశ" "ఆత్మబల" "అమర శిల్పి జక్కన్న." "రామదాసు" "పుట్టినిల్లు-మెట్టినిల్లు" మొదలయిన చిత్రాలలో శ్రీ నాగయ్య చూపెట్టిన హావ భావాలు అమృత గుళికలు. ఎంత చిన్నపాత్రలోనయినా ఆయన "ప్రొజెక్టు" అయి కథానాయికా, నాయకుల్ని వెనక్కు తరిమివేసేవారు.

శ్రీ నాగయ్య "డిక్షన్" టిపికల్‌గా ఉండేది. ఆయన సంభాషణోచ్చారణలో "డైనమిజం" తొణికిసలాడేది. ఏకాగ్రత ఆ మహానటునకు ఖజానా. శ్రీ నాగయ్య దర్శ కత్వంలోకూడా గొప్ప ప్రజ్ఞాశాలి. ఆయన వీక్షణాశక్తి (Visualisation Power) అసామాన్యం. ఆయన సంగీ తంలో భావ, రాగ, తాళాలు సమైక్యతకు సంపాదించుకుని, ఆయన వ్యక్తిత్వ ప్రతిభకు కర్పూరహారతులు పట్టేవి.

మహాత్మా గాంధి చనిపోయినప్పుడు లండన్ టైమ్స్ పత్రికా విలేఖరి వచ్చి "గాంధిగారి మీద మీ అభిప్రాయం ఏమిటి" అని జార్జి బెర్నార్డ్‌షాను అడిగితే ఆయన అయిదు నిమిషాలపాటు ఆలోచించి అశ్రునయనాలతో 'He is not a man: He is a phenomenon' అన్నాడు. శక పురుషుడు శ్రీ నాగయ్య కూడా ఆ కోవకు చెందిన వారని అస్మదీయుని అభిప్రాయం. ఆ పూర్ణ పురుషునకు, ఆ కర్మ యోగికి అస్మదీయుని జోహార్లు.

# నాగయ్యగారికి శ్రద్ధాంజలి

రచన: పద్మభూషణ్ డాక్టర్ బి.ఎన్. రెడ్డి..

[ శ్రీ నాగయ్య మరణించినప్పుడు తమ ఆవేదనను వెలిబుచ్చుతూ శ్రీ రెడ్డి యీ రచనను 'విజయచిత్ర' పత్రికకు అందజేశారు. ఆ పత్రిక సౌజన్యంతో ఆ రచనను యీ సంచికలో ప్రచురిస్తున్నాం. —సంపాదకుడు ]

ఈ నాడు దేశంలో ఎందరో ప్రతిభావంతులయిన నటీనటులున్నారు. కాని దైవాంశ సంభూతులయిన ఉత్తమ కళాకారులు చాలా తక్కువ మంది. వారిలో మా నాగయ్యగారు ఒకరు. దేశానికి. సంఘానికి కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించేది యీ మహాకళాకారులే!....మానవునిలో అమరత్వాన్ని చూపగల కీర్తి వీరికుంది. తన వ్యక్తిత్వాన్ని తాను నటించే పాత్రలో మరుగుపరచి. పరకాయ ప్రవేశం చేసే మహాసిద్ధునివలె పాత్రలో జీవించినవాడే ఉత్తమ కళాకారుడు. 'పోతన', 'వేమన'. 'త్యాగయ్య' లను మనం తెరమీద చూచినప్పుడు ఆ మహనీయులు సజీవంగా మనకు దర్శన మిస్తున్నారా అన్న భ్రమ కలిగించేలా నటించిన కీర్తి మన పద్మశ్రీ నాగయ్యగారికి దక్కింది. ఈ మహానుభావుడు నేడు కీర్తిశేషులయ్యారు. కళ వ్యాపారంగా మారిన. మారుతున్న యీ నాడు—అలసిన తన ముద్దు బిడ్డను కళాలక్ష్మి తన చెంతకు చేరదీసింది. మరెన్ని జన్మలకో. ఎప్పుడో. ఏ రూపంలోనో వారిని కలుసుకునేది!...ఈ జన్మలో దాదాపు నాలుగు దశాబ్దాలు వారి స్నేహసంపద లభించడం నా పూర్వ జన్మసుకృతం. వారు నాకంటే పెద్దవారు. బహుముఖ ప్రజ్ఞావంతులు. నాకు, మా వాహినీ సంస్థకు కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి తను కీర్తిశేషులయ్యారు.

రకరకాల పిచ్చి తీగెలతో పాచిపట్టిన సినిమా బురద మడుగులో విజ్ఞాన. వికాసాలను. కళాకాంతులను వెద జల్లుతూ, తెలుగు దేశంలో సభ్యత. సంస్కారంకల సహృదయులను పరవశింపజేసి. వారి హృదయాలలో నివసించే సుందరపద్మం మా నాగయ్య!...దక్షిణ చలనచిత్ర చరిత్రలో ప్రప్రథమంగా 'పద్మశ్రీ' గౌరవాన్ని అందుకున్న ధన్యమూర్తి మా నాగయ్య!...

'గృహలక్ష్మి' చిత్ర నిర్మాణపు రోజుల్లో నాగయ్యగారితో నా పరిచయం స్నేహంగా మారింది. వారి గాన మాధుర్యంతో నన్ను నేను మరిచిపోయేవాడిని. భావయుక్తంగా త్యాగయ్య కృతులను పాడి వినిపించేవారు. మా నాగయ్యలో త్యాగయ్యను చూచేవాడిని. పసిపిల్లవాడిలాగనే నాగయ్య పాటపాడుతూ కన్నీరు పెట్టిన దృశ్యాలు యిప్పటికీ మరిచిపోలేను. నా జీవితంలో మధురాతి మధురమైన ఘడియలు అవేనేమో అనిపిస్తుంది.

ఈ మహానుభావుడు తనకు భగవంతుడు ప్రసాదించిన కళాసంపదను, సంగీత జ్ఞానాన్ని ఏకాగ్రతతో ఆరాధించి. సాధన చేసివుంటే త్యాగయ్య తరువాత మరొక నాగయ్య తెలుగువారి వరప్రసాదంగా-వారి కీర్తి నిలిచిపోయేది!.... పూర్వం మహా ఋషుల తపస్సుకు భంగం చేయడానికి దేవతలు పన్నాగాలు పన్నినట్లు, యీ లోకంలో మహా కళాకారులకుకూడా ఏవో కొన్ని బలహీనతలు-వారి లక్ష్య సాధన నెరవేరకుండా చేస్తుంటాయి.

బహుముఖ ప్రజ్ఞావంతులు, చిత్ర నిర్మాతలు, దర్శకులు, సంగీత దర్శకులు మహానటులు, వినయ విధేయులు, తన్ను మాలిన ధర్మపరులు, దయార్ద్రహృదయులు, పరోపకారి, భాగవతులు, సంగీత విద్వాంసులు, సినిమా రూపకర్తలు, త్యాగమూర్తులు—యిలా వారి విశిష్టత, గొప్పతనం ఎంతయినా చెప్పగలను; తెలుగు చలనచిత్ర చరిత్రలో స్వర్ణాక్షరాలతో పద్మశ్రీ నాగయ్యగారి పేరు ఆచంద్రార్కం నిలిచి తీరాలి; తీరుతుంది.

కళారంగంలో సిద్ధేంద్రస్వామి, క్షేత్రయ్య, త్యాగయ్య, నారాయణవ్యాస్. ద్వారం వెంకటస్వామి నాయుడుగారు, మా బళ్ళారి రాఘవుడు - ఆదిగాగల చరిత్ర పురుషుల జాబితాలో చేరవలసినవారు-మా నాగయ్యగారు. తనకెందునా ఉపకరించని కార్యకలాపాలకు, కార్యక్రమాలకు దూరంగా నిలిచి. త్రికరణ శుద్ధిగా కళారంగానికి అంకితం కాలేకపోయారు!... ఈ కళామూర్తిని మరొకసారి మనకు దయచేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాను. వారితో నాకున్న ఆత్మీయతను పురస్కరించుకొని ఆవేదనతో యీ మాటలు వ్రాశాను. దైవాంశ సంభూతుడయిన యీ మహా కళాకారుడు మా నాగయ్య ఆత్మకు శాంతిని ప్రసాదించమని నటరాజస్వామిని ప్రార్థిస్తున్నాను.

తెలుగు చలనచిత్ర కళామతల్లికి

# భరణీవారి ఆభరణాలు

- రత్నమాల
- లైలామజ్ను
- ప్రేమ
- చండీరాణి
- చక్రపాణి
- విప్రనారాయణ
- చింతామణి
- వరుడు కావాలి
- బాటసారి
- వివాహబంధం
- గృహలక్ష్మి
- అంతా మన మంచికే
- విచిత్ర వివాహం
- అమ్మాయి పెళ్లి
- మనవడి కోసం

---


భరణీ పిక్చర్స్

ఆర్కాట్ రోడ్, మద్రాసు - 600026

# మా నాగయ్యగారు

రచన
కొడాలి ఉమామహేశ్వరరావు

అది 1973 డిసెంబరు 31 వ తేదీ. సమయం ఉదయం. చేతిలో వార్తా పత్రిక కలిగి వున్న ఒక మిత్రుడు "ఏమండోయ్- మీ నాగయ్యగారు పోయారు" అని పెద్ద కేక వేశాడు. ఒక క్షణం నిర్ఘాంత పోయాను. పరుగెత్తుకు వెళ్లి పేపర్ చూస్తే యింకేముంది? బాధాకరమైన వార్త అనివార్యంగా చూడవలసి వచ్చింది.



వారంక్రితమె 23 వ తేదీన పద్మశ్రీ చిత్తూరు నాగయ్య గారి దగ్గర శలవు తీసుకుని మా స్వగ్రామం కృష్ణాజిల్లా అంగలూరు చేరాను. నూతన వత్సరాన్ని గురించి మనసులో యింపుగా నింపుకున్న శుభదాయకమైన ఊహలన్నీ చెదరి పోయాయి. ఆయన దగ్గర నుండి శలవు తీసుకునే నాటికే ఆయనకు జ్వరం ప్రారంభమైయున్నది. అయినా స్వామి వివేకానందుని జీవితగాథను చలనచిత్రంగా తీయాలనే తపనలో వున్నారాయన. "మీరు వెళ్లిరండి మాస్టరుగారూ! అవసరమైతే ఈ లోపునే మీకు ఫోను చేస్తాను" అని ఆప్యాయతతో శలవిచ్చి పంపిన శ్రీనాగయ్య గారు యిక ఎన్నటికీ కనిపించరంటే, ఆయన గంభీర మధుర స్వరం శాశ్వతంగా యిక వినిపించదంటే ఎలా నమ్మేది? నిలబడిపోయాను.

శ్రీ చిత్తూరు నాగయ్యగారు దక్షిణ భారతదేశంలోనే ఒక పెద్ద – అతిపెద్ద – నటుడు. గాయకుడుగా. చిత్ర నిర్మాతగా. దేశభక్తుడుగా. త్యాగ ధనుడుగా. అతిధేయుడుగా. నటుడుగా ప్రజల హృదయాల్లో ఆయనపట్ల ప్రగాఢమైన ఆదరణ. శ్రద్ధ. గౌరవం వేళ్లూని యున్నవి. ఆయన ధన్యుడు.

మా బాల్యంలో 1940–50 సంవత్సరాల మధ్య కాలంలో శ్రీ నాగయ్యగారి ప్రభ. ప్రతిభ దక్షిణదేశ చిత్ర రంగంలో దిక్కులన్నిటా మారుమ్రోగుతూండేవి. పోతన. త్యాగయ్య. వేమన. స్వర్గసీమ. వందేమాతరం. సుమంగళి. మన దేశంలాంటి ప్రజాదరణ పొందిన ప్రముఖ చిత్రాల్లో శ్రీనాగయ్యగారు చూపిన అభినయ కౌశలం ఆంధ్రులెవరూ విస్మరించలేరు.

శ్రీ నాగయ్యగారు అతి సామాన్య కుటుంబంలో జన్మించారు. బాల్యం నుండే నాటక కళపట్ల ఆయనకు అపారమైన ఆసక్తి వుండేది. ఉన్నత విద్య పూర్తిచేసి జీవితంలో ఎన్నో యిబ్బందుల నెదుర్కొని తెలుగు చలన చిత్ర రంగంలో ప్రవేశించారు. మధ్యాహ్న మార్తాండుని వలె ప్రకాశించి. క్రమంగా సంధ్యాసమయాన్ని అనుసరిస్తూ వచ్చి విస్తరించిన ఖ్యాతిలో అస్తమించారు.

కీ॥ శే॥ చిత్తూరు నాగయ్యగారితో నాకు 1970 వ సంవత్సరంలో పరిచయ భాగ్య మేర్పడింది. ఆంధ్రుల అభిమాన యువక హీరో శ్రీ శోభనబాబుగారి నూతన భవన ప్రవేశ సందర్భాన ఆహ్వానితునిగా మద్రాసు చేరిన నేను ఆ నగరి నుండి ఏవేవో ఊహలతో. ఆశలతో చెన్నపురి లోనే తిన్నగా ఉండి పోయాను. పరిస్థితుల ప్రభావం వల్ల శ్రీ శోభనబాబుకి సన్నిహితుణ్ణి కావటం చేత క్రమంగా చిత్ర రంగంలోని పలువురు పెద్దలతో పరిచయం ఏర్పడింది. పరిచయారంభంనుండే శ్రీ నాగయ్యగారికి నాపట్ల ఆప్యాయత. వాత్సల్యం మెండుగానే వుండేవి. భౌతికమైన సంపదలేమీ లేని శ్రీ నాగయ్యగారి పరిచయం నా కెంతో అమూల్యమైన నిధిగా వుండేది. ఆయన నాబోటివాణ్ణి అమితంగా గౌరవించటం నా కెంతో బరువనిపించేది.

శ్రీ నాగయ్యగారి ఆఖరి సంవత్సరం నా స్మృతి పథంలో అత్యంత ఆసక్తిదాయకంగా వుంటుంది. ఏదో చిత్రం నిర్మించాలనీ. రచయితగా. వీలుంటే గాయకునిగా నాబోటివాణ్ణి ప్రోత్సహించాలని ఆయన మనసులో వుండేది. మా యిరువురి సన్నిహితత్వం ఎంతో పెరిగింది. నా టపా

(తరువాయి 42 వ పేజీలో)

# అమరజీవి శ్రీ నాగయ్య

రచన: పేకేటి శివరాం

నేను మద్రాస్ వచ్చిన మొదటి రోజులు అవి. వెనక్కి తిరిగి ఊహించుకుంటే 38 సంవత్సరాలు పై మాట. ఆ నాడు నాగయ్యగారు మకుటంలేని మహారాజు లాగ తెలుగు చిత్ర రంగంలో ప్రకాశిస్తున్నారు. 'నా' అనే వాళ్లు లేక, అండ కోసం అల్లాడే నాలాంటి వాళ్ల నెందర్నో ఆదరించి. ఆదుకున్న వ్యక్తి ఆయన. ఈ నాడు తల్చుకుని, ఆయన పేరు స్మరించుకుని. ఆయన వల్ల అంతా ఉపకారం పొందిన వాళ్లల్లో నేనొకణ్ణని చెప్పుకునేందుకు ఏమీ భిడియ పడక్కర్లేదు.



ఎంత మందో ఆయన ప్రేమ, వాత్సల్యాలు అనుభవించారు. ఎందరో ఆయన వల్ల ఆర్థిక లబ్ధి పొందారు. కృతజ్ఞత అనేది. స్మరించటం అనేది మానవుడిలో కనీస ధర్మం అయితే. అది మనసారా పాటిస్తున్నాను. నేను ఆయన దగ్గిర పని చెయ్యలేదు. కాని, కనిపించినప్పుడు ఆయన చూపించిన ప్రేమానురాగాలను జన్మజన్మలకూ మర్చిపోలేను. ఆయనవల్ల నేను పొందిన ధన సహాయం చాలా తక్కువ. కాని అది అందించిన అవసరం గుర్తుకు తెచ్చుకుంటే ఎన్ని జన్మలకైనా తీర్చుకోలేని ఋణం అది. మహా నటుడు – మహా కళా తపస్వి- వితరణ తెలియని త్యాగశీలి గనకనే పాపం 'తను' అనేది మర్చిపోయి. 'స్వంతం' అనేది విస్మరించి. ఏమీ లేకుండా. ఏదీ మిగల్చకుండా వెళ్లిపోయాడా మహా నటుడు. కాని ఎవరూ మిగల్చలేనిది ఆయన ఉంచి వెళ్లాడు. అదే మంచిమాట - మంచిపేరు.

When the great big gong of death is sounded and the body is decorated with the decorations for the last journey; we shall take with us only a traveller's bundle"— అన్నాడొక మహాకవి.

అందుకే శ్రీ నాగయ్యగారు మిగిల్చినది అజరామరమైన కీర్తి.

ఆయనెప్పుడూ అమరజీవే! ఆయనను స్మరించుకుంటేనే చాలు కళాకారుల మని చెప్పుకుంటూ చేసే కొన్ని పాపాలు క్షీణిత మౌతాయి.








అమరజీవీ :

వేదసారము ఆటవెలది పాదములందు
చిందింప జేసిన సిద్ధుడొకడు
వాకిట నిల్చున్న వాగ్దేవి కాటుక
కన్నీరు తుడిచిన ఘటికుడొకడు
తనగాన లహరిలో జనసమూహమునెల్ల
ముంచి తేల్చిన పుణ్యమూర్తి యొకడు
అభయమీయక ఒక్క అడుగైన
దాటనీనని రామునడ్డిన అనఘుడొకడు
అట్టి వేమన పోతన త్యాగరాజు
రామదాసును మరల ఈ భూమిపైన
ఒక్క రూపున నీవౌచు ఉద్భవించినారు
ఈ మాట కాదను వారులేరు ॥....





* * *

చలన చిత్ర జగత్తులో అలుపెరగక
ముఖ్యమౌ పెక్కు శాఖల ముప్పదేండ్లు
కోతికొమ్మచ్చు లాడిన కుఱ్ఱవాడ !
నీ చరిత్రకు చ్యుతిలేదు నిశ్చయముగ ॥—




చిత్రకళామతల్లికి పి. ఎ. పి. వారు సమర్పించిన వినూత్న కానుకలు

తెలుగులో

* పెంపుడు కొడుకు
* ఇల్లరికం
* భార్యాభర్తలు
* కులగోత్రాలు
* పునర్జన్మ
* మనుషులు_మమతలు
* నవరాత్రి
* బ్రహ్మచారి
* ఆదర్శ కుటుంబం
* భార్యా బిడ్డలు
* పల్లెటూరి బావ
* అల్లుడొచ్చాడు
* అత్తవారిల్లు
* ఆలుమగలు

కన్నడంలో

* మానవ మగళు
* మన్నె అళియ

మలయాళంలో

* కళిత్తోళన్

తమిళంలో

* పెత్రమనం
* మాడివీట్టు మాప్పిళ్లై

మా రాబోవు తెలుగు చిత్రం

'అర్ధాంగి'

— నిర్మాత : ఎ. వి. సుబ్బారావు —

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ (ప్రై) లిమిటెడ్,

9. కృష్ణారావు నాయుడు వీధి. మద్రాసు_600 017.

# మా అన్నగారు

రచన: వి. సుబ్రహ్మణ్యం.

నాగయ్యగారు, నేను ఏక గర్భసంజనితులం. మా తరువాత మా తల్లి దండ్రులకు యిద్దరు సోదరీ మణులు కలిగారు. మా తండ్రిగారి పేరు రామలింగశాస్త్రి: తల్లి వెంకటలక్ష్మమ్మ. మాది భగవద్భక్తికి అంకితమైన కుటుంబం. శాస్త్రోక్తమయిన కర్ణాటక సంగీత విద్య మాకు వంశపారంపర్యంగా అబ్బింది. గాత్ర సంగీతంలోనే కాక జంత్రవాయిద్య సంగీతంలోకూడా మాకు బాల్యంనుంచి ప్రవేశముంది. కొందరి ప్రోత్సాహంతో ఉన్నత విద్యను అభ్యసించడం కోసం మేము చిత్తూరులో స్థిరనివాసం యేర్పాటు చేసుకున్నాం. మా అన్నగారయిన నాగయ్యగారు బడి చదువులతో పాటు సంగీతం కూడా గొప్ప విద్వాంసులవద్ద నేర్చుకున్నారు. నేను మాధ్యమిక పాఠశాల చదువుతో మానేసి, మా తండ్రిగారి వద్ద కొంతకాలం, మా వంశీయుల వద్ద మరికొంత కాలం సంగీత విద్యను అభ్యసించాను.

కళాశాల చదువుకోసం మా అన్నగారు మద్రాసుకు వెళ్ళి, అక్కడ ఆంగ్ల విద్యతోపాటు సంగీత విద్యను కూడా ప్రముఖ సంగీత, సాహితీవేత్తల శుశ్రూష సలిపి నేర్చుకున్నారు. హార్మోనియం వాయించడంలో వారు తమ ప్రతిభను వెల్లడి చేశారు. నాటకరంగస్థలిమీద పాదం పెట్టి వారు రామదాసు, కబీరు మొదలయిన పాత్రలను దాల్చి,

---

## మా నాగయ్యగారు........

( 38 వ పేజి నుంచి )

ఆయన అద్రుసుకే రావటం, ప్రతి నిత్యం నేనాయన్ని ఒకసారయినా కల్సుకోవటం. వారి కుటుంబంలోని వారెల్లరూ నన్నొక సన్నిహితుణ్ణిగా భావించటం జరిగింది. ఇలాంటి గొప్ప వ్యక్తితో రెండు దశాబ్దాల క్రితమే పరిచయ మేర్పడి వుంటే ఎంత బాగుండేది—అని అనిపించేది. స్వలాభానికి సంబంధించినంతవరకు గాఢనిద్రనుండి త్రుళ్ళిపడిలేచి ఖంగారుపడివున్న నావోటి వాళ్ళకి అలా అనిపించటం సహజమే.

శ్రీ చిత్తూరు నాగయ్యా జీవితం అవ్యాపారిపులకొక అసాధారణ పాఠం. ఆయన ధనం ఆర్జించారు. ఘనంగా వర్షించారు. చివరకు గర్జించారు. అయితే ఆ వృద్ధ కేసరిగర్జనలో బాధ, కసి, పశ్చాత్తాపం తప్పమరేమీ వుండేవికావు. "జీవితానికి, భవిష్యత్తుకి ఒక పథకం. ప్రణాళికలేని అమోఘమయపు జీవుల్లో శ్రీనాగయ్యా అగ్రగణ్యులు. అందరూ ఆఖరిరోజుల్లో—చేసిన పాపాలకి బాధపడుతోంటే ఆయన తానుచేసిన పుణ్యాలకు బాధపడేవారు. ఆయన మానసిక స్థితి సరిగా వుండేదికాదు. అది సహజమే. 'రామదాసు' లా దేవుణ్ణి దూషించేవారు. కృతఘ్ను పరిచితుల్ని కృతనిశ్చయంతో వ్యతిరేకించేవారు.

ఆయన జాతీయవాది. దేశభక్తుడు. మృతికి కొన్నినెలల ముందు ముఖ్యమంత్రి శ్రీజలగంవారికి ఆయన పంపిన అభినందన సందేశంలోని పదజాలం నా స్మృతిలో మెదుల్తూ వుంది. గ్లామరు, ఐశ్వర్యం శాశ్వతమనే దుర్భ్రమలో వున్నవారివలె ఆయన ప్రవర్తించారు. రెండూ వెనకడుగువేయ నారంభించినవ్ చురుగ్గా. ఇంట్లో ఖర్చులు ఆవేగంతో తగ్గవుగదా! ఆయన పరివారమొక పుష్పక విమానం. పరిస్థితుల ప్రభావాన ఆయనకు తగని మార్గాలగుండా ఆయన అప్పుడప్పుడు పయనించటం జరిగించికూడా!..

శ్రీనాగయ్యగారు మరిలేరు. ఆయన కీర్తి అనుపమానం. ఆయన నిష్కాపట్యం అసాధారణం. ఆయనెప్పుడూ గొప్ప వ్యక్తే. మతుల్లో ఆయన స్మృతులు, సంగీత శృతులు కలకాలం వుంటవి. ఎన్ని ఆటంకాలొచ్చినా అచంచల దీక్షతో ఆయన కాంస్య విగ్రహానికి పాటుపడిన శ్రీ ఇంటూరి, శ్రీ గుమ్మడిగార్లకు, తదితర పెద్దలకూ ఆంధ్రుల అభినందనలు లభించగలవు.

ప్రభుత్వోద్యోగులను, ప్రముఖ విద్యావేత్తలను ముగ్ధుల్ని చేసి, స్వర్ణ, రజతపతకాలను ఎన్నిటినో సంపాదించ గలిగారు.

చిన్నప్పటినుంచి అన్నగారంటే నాకు అమిత భక్తి. వారిని నేను నా తండ్రి లాగ చూసేవాణ్ణి. వారికి కూడా నా యందు పుత్రవాత్సల్యం ఉండేది. మా అన్నగారు కొంత కాలం చిత్తూరులో ప్రభుత్వోద్యోగంలో ఉండి మా కుటుంబీకులనందరిని వివాహాది శుభకార్యాలు జరిపి పైకి తీసుకొచ్చారు. మా అన్నగారికి ప్రథమ కళత్రం, ఒక బిడ్డ చనిపోయారు. వెంటనే వారు మరో పెళ్లి చేసుకున్నారు. ఆమె కూడా కాలధర్మం చెందడంతో మా కుటుంబాన్ని విషాదచ్ఛాయలు కమ్ముకున్నాయి. మా నాన్నగారు మనో వేదనతో మంచం ఎక్కారు.

నేను వయలిన్ నేర్చుకోని, సంగీతంలో డిప్లమో పుచ్చుకోని, చిత్తూరులోని ఒక ఉన్నత బాల, బాలికా పాఠ శాలలో ఉపాధ్యాయుడుగా చేరాను. మా అన్నగారు నాటక కళకు తమ జీవితాన్ని అంకితం చేసుకోని, బయటి ఊళ్లల్లో తిరుగుతుండడం చేత, మా కుటుంబాన్ని నేనే చూసుకో వలసి వచ్చింది. మా తండ్రిగారు కాలధర్మం చెందారు. 'నాయనా - అమ్మగారి పాదసేవచేసి తరించు - నేను మన కుటుంబానికి సముచితమైన ఆర్థిక సాయంచేస్తుంటాను' అని మా అన్నగారు మా మాతృమూర్తిని నాకు అప్పగించి, మద్రాసుకు వెళ్లి పోయారు.

మా అన్నగారు సంగీతంలో గొప్ప కీర్తి, ప్రతిష్ఠలను గడించారు. హెచ్. ఎం. వి. గ్రామఫోను కంపెనీవారు వారి గానాన్ని రికార్డులలోకి ఎక్కించారు. అవి ఆ రోజుల్లో వేల సంఖ్యలో అమ్ముడు పోయాయి. తరువాత అన్నగారు సినిమా రంగప్రవేశం 'గృహలక్ష్మి' చిత్రంలో సలిపారు. వారి కీర్తి లత దశదిశలు పాకింది. పోతన వేమన, త్యాగయ్య, రామదాసు పాత్రలను పోషించి మా అన్నగారు మహానటులుగా రూపొందారు.

వారు లక్షలకు లక్షల రూపాయలను ఆర్జించారు. ఆ డబ్బంతా వారు విద్యాసంస్థలకు, వ్యక్తులకు విరాళాల రూపంలో ముట్టజెప్పారు. వారి దాతృత్వాన్ని చవి చూడని సంస్థ ఆంధ్రదేశంలో లేదని అందరూ అంటుంటే నేను విని ఆనందించాను. ఒక చెంప తమ ఆర్జనను వారు సంఘసేవకు వెచ్చిస్తున్నా మా కుటుంబాన్ని వారు మరిచి పోలేదు. నాకు ఒక కొడుకు, ముగ్గురు ఆడపిల్లలు. వీళ్లందరిని వారు పైకి తీసుకొచ్చారు. మా అన్నగారు నాకు ఒక ప్రత్యక్ష దైవం. మా పిల్లలు కూడా ఆయన్ను అల్లా చూసుకునే వారు.

మా అన్నగారు అవసాన దశలో ఉన్నారని నేను మద్రాసుకు వెళ్లి వారిని చూచాను. నా తల నిమిరి, సత్యం, ధర్మం, న్యాయం మొదలయిన వాటి మీద నాకు హిత బోధచేసి, కంటనీరు పెట్టుకున్నారు. వారు వెళ్లిపోతున్నా రని తెలుసుకోని నేను వారి సమక్షంలో 'హరేరామ, హరే కృష్ణ' అంటూ భగవన్నామ సంకీర్తన చేశాను. మా తండ్రి మమ్మల్ని వదిలి పరలోకానికి వెళ్లి పోయారు. ఆయన నాకు, నా కుటుంబానికి చేసిన సాయం జన్మజన్మలకు తీర్చుకో లేను.

నా ఆరోగ్యం సరిగ్గా లేకపోయినా మా అన్నగారి అంత్యక్రియలను యథావిధి శాస్త్రోక్తంగా నిర్వహించాను. భౌతికంగా ఆయన నాకు కనపడక పోయినా ఆయన మూర్తి నా కళ్లముందు తాండవిస్తోంది. ఆ మహామహు నకు నేను తమ్ముడనై పుట్టడం నా పూర్వ జన్మ సుకృతం. ఎన్ని జన్మలకైనా వారి సేవాభాగ్యం నాకు లభించేటట్లు చేయమని అనుక్షణం నేను ఏడుకొండల వెంకటేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ, కాలం గడుపుతున్నా.



# మహామనీషి శ్రీనాగయ్య

రచన:
హరి అచ్యుతరామశాస్త్రి

బహుముఖ ప్రజ్ఞాన్వితులయిన స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారిని గురించి చెప్పడం అంటే సూర్యుణ్ణి దివిటీపెట్టి చూపెట్టడం అవుతుంది. పోతన, వేమన, త్యాగయ్య పాత్రలను పోషించి వారు లక్షలాది సినిమా ప్రేక్షకుల హృదయాలలో పీఠం వేసుకొని కూచున్నారు.



మా నాన్నగారైన 'వాగ్గేయకారకరత్న' శ్రీహరి నాగభూషణంగారు 'అపర త్యాగరాజు' అని పలుపురిచే కీర్తింపబడ్డారు. వారు నిర్మించిన 'త్యాగయ్య' చిత్రం బందరులో విడుదల అయినప్పుడు తప్పకుండా కుటుంబంతో సహా చూడవలసిందిగా నాగయ్యగారు మా నాన్నగారికి ఆహ్వానం పంపారు. తరువాత వారు బందరు వచ్చి మా నాన్నగారిని స్వయంగా సన్మానించారు. అప్పుడు నేను చిన్నవాణ్ణి. నాగయ్యగారిలో ఉన్న 'మహా మనీష' ని నేను చూడగలిగాను. ఆ మహా పురుషుని దర్శన భాగ్యం కలిగినందుకు నాలో నేను ఎంతో ఉప్పొంగిపోయాను.

1957 లో నేను మద్రాసుకు వచ్చాను. నాగయ్యగారు 'నాయిల్లు' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. 'తమ ఆర్కెష్ట్రాలో వయలినిస్టుగా పనిచేయాలనుంది' అన్నా నేను. వెంటనే ఆ మహామహుడు నన్ను వారి శిబిరంలోకి తీసుకున్నారు. వృత్తికి సంబంధించిన నా జీవితానికి వారి కంపెనీలోనే అంకురార్పణ జరిగింది. వారి ఆదరాభిమానాలను జన్మజన్మలకు మరిచిపోలేను. వారిది అమృత హృదయం.

గత ఇరవై అయిదేళ్ళనుంచి నేను సినిమా రంగంలో పనిచేస్తున్నాను. మద్రాసు సినీ మ్యూజిషన్స్ యూనియన్‌లో ఒక విశిష్ట స్థానాన్ని నేను సంపాదించుకోగలిగాను. శ్రీ అద్దేపల్లి రామారావు, శ్రీ అశ్వత్థామ, శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి మొదలయిన మహామహుల పరిచయ భాగ్యం నాకు నాగయ్యగారి ద్వారానే కలిగింది. వారి శిలావిగ్రహం మద్రాసులో వెలుస్తున్నదంటే నేను ఎంత సంతోషపడ్డానో చెప్పలేను. నా అభ్యున్నతికి కారకులయిన మహామనిషి నాగయ్యగారికి యీ శుభ సమయంలో నా జోహార్లు అందజేస్తున్నా.

# నాగయ్య
## స్వీయచరిత్ర నుండి

(16 వ పేజీనుండి)

ఆలోచనలేదు. అందుచేత పూనుకున్నాను. కాని లేకపోతే ఆ ఆలోచనే నాకు ఉండేది కాదు. అంతలో-నాకు సహాయం చేస్తానని, భాగస్వామిగా వస్తానని మాటయిచ్చిన జమిందారు నాకేమీ చెయ్యలేనని జారుకున్నాడు. అంతే!.. దాంతో నాకు పెద్ద దెబ్బ తగిలింది. ఖర్చుచేసిన సొమ్మంతా పోయినట్టే!.... ఇంక నేనేమీ చేయలేక పోయాను. నన్ను నమ్మించి ఆ జమీందారు తప్పుకున్నాడు. ఇలా నేను ఎన్నిసార్లో మోసపోతున్నాను. అందరి మాటనమ్ముతాను. అందరిని విశ్వసిస్తాను. అదే నా ఆర్థిక పతనానికి కారణమయింది.

అయిన డబ్బు ఖర్చుకాగా దాంతో చేతులు కాల్చుకుని స్టూడియో నిర్మాణం విషయం విరమించాను. రెండు లక్షల రూపాయిలు వృధాగా, ఎందుకూ కాకుండా పోయినాయి.

ఆ తరువాత–యిబ్బందులలో ఉన్న ఒక స్నేహితునికి సహాయం చెయ్యబోయి–50 వేల రూపాయిలకు సెక్యూరిటీ యిచ్చి దెబ్బతిన్నాను. దాంతో నా తోట వాకటు పెట్టవలసి వచ్చింది. తరువాత దానిని అమ్మి వేశాను. ఇప్పుడు శ్యామల స్టూడియో, కల్పగం స్టూడియో, ఏ. వి. యం. వారి స్టూలు ఉన్నచోట్లలోనే అప్పటి నా తోట ఉండేది.

వాహిని స్టూడియోకు శంకుస్థాపన జరిగింది. నేడు ఆసియాలో అగ్రస్థానం వహిస్తున్న ఆ స్టూడియో నిర్మాణానికి జరిగిన ఉత్సవంలో నేను పాల్గొని నాచేత్తోకూడా మట్టి వేసినందుకు, అలాంటి అవకాశం కలిగినందుకు నేనెంతో సంతోషిస్తూ ఉంటాను.

నాకు మళ్లీ ఆర్థిక సంబంధమైన యిబ్బందులు యేర్పడ్డాయి. ఎన్నో సంస్థలు నాచేతిమీదుగా ఆరంభమయినాయి. ఎందరికో సహాయాలు చేశాను; సహకారం అందచేశాను. ' నేనేం చేసినా యితరులకు ఫలిస్తుందే కాని నాకు మాత్రం ఫలించదు' అని నాకు నేను నచ్చ చెప్పుకున్నాను. అది నా పురాకృత శాపం అయి ఉంటుంది.

కొందరు పెద్దలు అన్నట్లు సినిమా నటుడికి ' గ్లామర్ ' అన్నది నాతోనే ఆరంభమయింది. సినిమా నటనకు విశిష్టత నాతోనే ఆరంభమయింది. సినిమా నటుడు ఎక్కువ పారితోషికం పుచ్చుకోవడం నాతోనే ప్రారంభమయింది. అప్పట్లోనే తమిళ చిత్రాల్లో నటించడానికి 50 వేల రూపాయిలనుంచి 75 వేలవరకు తీసుకునేవాడిని. అలాంటి వ్యక్తికే తిరిగి యిబ్బందులు ఎదురయినాయి అంటే-ఏం చెప్పాలి? అది స్వయంకృతాపరాధమా?.... పూర్వ జన్మలో చేసుకున్న మహా పాపమా?

వేమన చిత్రం నామీద ప్రభావం చూపినట్టే కొందరు యితరులమీద చూపెట్టింది. ముఖ్యంగా మమ్మిడివరం బాలయోగినిని యీ సందర్భంలో పేర్కొనవచ్చు. ఆ బాలుడు వేమన చిత్రంచూసిన తరువాతనే ఆ విధంగా విరాగిగా మారగలిగాడని. ఆ చిత్రమే అతనిలో ఒక విధమైన జ్యోతిని ప్రజ్వరిల్లజేసిందని, అతని బంధువులు రాస్తుండేవారు. ఆ తరువాత అతను 'భక్తపోతన' చిత్రం కూడా చూశాడట!.... అతను ఆ విధంగా మారడానికి 'యోగి వేమన' చిత్రమే కారణమనడంలో ఎంతవరకు నిజం వున్నదో నాకు తెలియదు. అతన్ని దర్శించడానికి ఆ తరువాత నేనూ వెళ్లాను. త్యాగయ్య, పోతన, వేమన చిత్రాలలోని పాటలు, మరికొన్ని పాటలూ పాడాను. కాని అతను కళ్ళు మూసుకునే ఉన్నాడు. నన్ను గమనించనే లేదు. ఆ బాలునిలో అటువంటి వైరాగ్యం కలగడానికి ఆ చిత్రమే కారణమని, ఒక విధంగా అతనికి నేనే గురువునని అక్కడి వారందరు నన్ను ప్రశంసిస్తుంటే నా శరీరం జలదరించింది. ఆ బాలయోగి పుంగవుని పాదాలకు సాష్టాంగంగా నమస్కరించి వచ్చేశాను.

ఆ తరువాత ఎన్నో చిత్రాలలో నేను ప్రధాన పాత్రలు ధరించాను. ఎన్నో ప్రశంసలు, ఎన్నో బిరుదులు పొందాను. ఆంధ్ర, తమిళ, కర్ణాటక, మలయాళం రాష్ట్రాలలో పలుచోట్ల పురపాలక సంఘాలు, పంచాయతీ సమితులు, పౌర సభలు నాకు గొప్ప సన్మానాలు చేశాయి. కనకాభిషేకాలు సలిపాయి. నటసార్వభౌమ, నటరాజు, నటశేఖరవంటి బిరుదులు నాకు పలుతావుల్లో లభించాయి.

సుమారు నాలుగు దశాబ్దాలపాటు దక్షిణభారత చలనచిత్ర ప్రపంచంలో
నటులుగా, గాయకులుగా, సంగీత దర్శకులుగా దేదీప్యమానంగా
వెలిగి, చరిత్రను సృష్టించిన స్వర్గీయ శ్రీ చిత్తూరు
వి. నాగయ్య దివ్యస్మృతికి మా అంజలి
ఘటిస్తున్నాం.

— శ్రీధరరావు, లక్ష్మీరాజ్యం —

  

రాజ్యం పిక్చర్సు పతాకంకింద యింతవరకు రూపొందిన తెలుగు చిత్రాలు

- దాసి
- హరిశ్చంద్ర
- కృష్ణలీలలు
- నర్తనశాల
- శకుంతల
- గోవుల గోపన్న
- రంగేళి రాజా

ఇటీవల శ్రీకాకుళంలో నాకు ఘన సన్మానం జరిగినప్పుడు అక్కడివారు 'నటపితామహ' అన్న బిరుదును యిచ్చారు. అయితే యీ బిరుదులు నేను ఎక్కడా వాడుకోనూలేదు; ఎవరికీ తెలుపుకోనూలేదు. ఇది 'స్వీయచరిత్ర' కాబట్టి యిందులో ప్రస్తావించక తప్పలేదు.

జెమినీ అధినేత శ్రీ వాసన్ 'చక్రధారి' పేరిట గోరాకుంభార్ జీవితాన్ని చిత్రంగా ఆరంభిస్తూ నాకు ఆ పాత్ర యిచ్చారు. గోరాకుంభార్ మహారాష్ట్రీయుడు. గొప్ప దైవభక్తుడు. అతని జీవితాన్ని చిత్రంగా తీయాలన్న కోరిక శ్రీ వాసన్ తల్లిగారిది. ఆ పాత్ర ధరించడంతో నా ఖ్యాతి యింకోమెట్టు పైకి వెళ్లింది. ఒక్క తమిళ దేశంలోనేకాకుండా తెలుగు, మలయాళ, కన్నడ దేశాలలోకూడా యీ చిత్రం బాగా నడిచింది. చిత్ర నిర్మాణం పూర్తి అయిన తరువాత శ్రీ వాసన్ నన్ను తన ఇంటికి ఆహ్వానించి ఘనంగా సత్కరించారు. చక్కటి విందు పెట్టారు. 15 వేల రూపాయిలు. పట్టు వస్త్రాలు ఒక పళ్ళెంలోపెట్టి నాకు బహూకరించారు. ఆ చిత్రంలో నటించినందుకు నాకు 45 వేలరూపాయిలు ఇచ్చారు. బహుమతి రూపంలో ఎక్కువగా అలా పదిహేను వేలుకూడా ఇచ్చారు. ఈ సంఘటన నా జీవితంలో మరువలేనిది.

'నా యిల్లు' అన్న చిత్రాన్ని తెలుగు, తమిళ భాషల్లో నిర్మించి, అందులో నాయకుని పాత్రతోపాటు దర్శకత్వం, సంగీత దర్శకత్వంకూడా నిర్వహించాను. చిత్రం బాగా నడిచింది. కాని నా భాగస్వామి లాభాలలో నాకు అర్థ శాతం వాటా ఇస్తానన్నాడు. చివరకు ఒక కానీకూడా ఇవ్వలేదు. నేను మళ్ళీ మరోసారి మోసపోయాను.

నైజాం ప్రాంతాల రజాకార్ ఉద్యమం ప్రారంభ మయిన రోజుల్లో హిందూ ముస్లింలకు ఐక్యతకావాలని, గోల్కొండ నవాబులకాలంలో జరిగిన 'రామదాసు' కథను చిత్రంగా తియ్యవలసిందని ప్రఖ్యాత పత్రికా రచయిత శ్రీ ఈశ్వరదత్ ప్రోత్సహించారు. అప్పుడు ఆయన నైజాం నవాబు దగ్గర పెద్ద ఉద్యోగిగా ఉండేవారు. ఆయన ప్రోత్సాహంతో నైజాంకూడా యీ పనికి పూను కున్నారు. నేనే దర్శకత్వం వహించాలని, నిర్మాణానికి సారధ్యం వహించాలని నన్ను కోరారు; హైదరాబాదు రమ్మని నన్ను అహ్వానించారు. ఆ రోజుల్లో రజాకార్ దౌర్జన్యకాండకు నేనూ బలి అయిపోతానేమోనని భయపడి, బంధుమిత్రులు నన్ను వెళ్ళవద్దని ఎంతో బతిమాలాడారు. కాని హైదరాబాదులో అప్పుడు ప్రధాన మంత్రిగా ఉన్న లయఖాలీ గారే స్వయంగా శ్రీ ఈశ్వరదత్తుగారిని నన్ను తీసుకురమ్మని, భయపడవద్దని ధైర్యం చెప్పమని మద్రాసు పంపారు. నేను వెళ్లాను. కర్నూలు చేరుకునే సరికల్లా రెండు జీపులలో పోలీసులు సిద్ధంగా ఉన్నారు. అక్కడ నుంచి సకల మర్యాదలతో నన్ను తీసుకు వెళ్ళారు. హైదరాబాదులోని 'గ్రీన్ లాండ్స్' వసతి గృహంలో నన్ను వుంచారు. బంగళా చుట్టూ పోలీసు దళాన్ని రాత్రి, పగలు కావలా పెట్టారు. బంగళా నౌకర్లు ఉండేవారు. ఇద్దరు గవర్నమెంటు ఆఫీసర్లు, శ్రీ ఈశ్వర దత్తుగారు నాతోటే 24 గంటలు గడిపేవారు. ప్రభుత్వం అతిథికి జరగవలసిన మర్యాదలు ఏలోటు లేకుండా జరిగాయి. ఎప్పుడూ వెంటవాళ్లు సిద్ధంగా ఉండేవి.

గోల్కొండ భద్రాచలం, నల్గొండ, నిజామాబాదు యిత్యాది ప్రాంతాలన్నీ తిరిగి, కథావస్తువుకు కావలసిన విషయాలన్నీ సేకరించుకుని శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు, శ్రీ ఈశ్వరదత్తుగారల సహకారంతో కథను రూపొందించాను. కథను ప్రధానమంత్రిగారు, వారితో పాటు కొందరు పురప్రముఖులు విన్నారు. చాలా బాగుందన్నారు. 'రా మ దా సు' చిత్రనిర్మాణానికి కావలసిన సొమ్మంతా నైజాం ప్రభుత్వమే భరిస్తుందని శ్రీ లయఖాలీ అన్నారు. నన్నొక బడ్జెట్ తయారు చేసి పంపమన్నారు. ఆ మరురోజున మద్రాసుకు తిరుగు ప్రయాణం యేర్పాటు చేశారు. ఆ సాయంకాలం సుమారు వెయ్యిమంది పురప్రముఖులను ఆహ్వానించారు. నాకు తేనీటి విందునిచ్చి గౌరవించారు. ప్రిన్స్ ఆఫ్ బిరార్‌గారిచేత ప్రభుత్వం తరఫున గొప్ప కాశ్మీర్ శాలువాను బహూకరింప జేశారు. ఆ రాత్రి నైజాం ప్రభువుగారి వద్దకు తీసుకెళ్ళారు. పది నిమిషాలు వారి సన్నిధిలో గడిపాను. ఎంతో ఉత్సాహంగా మాట్లాడారు. వారు ఉర్దూలో హిందూ ముస్లిం సఖ్యతపై రచించిన ఒక గేయాన్ని చదివి వినిపించారు. నన్ను అభినందించారు. ఆ మరునాడే నేను మద్రాసుకు సురక్షితంగా చేరుకున్నాను. నేను వెళ్ళిన ప్రతిచోటా రజాకార్లను చూశాను. వారూ నన్ను చూస్తూ ఉండిపోయారేగాని – నా దగ్గిరకుకూడా రాలేదు. అంతగా నన్ను రక్షించి, గౌరవించి మళ్ళా మద్రాసు చేర్చారు. తిరిగి వచ్చిన తరువాత శ్రీ సముద్రాల రాఘవాచార్యులవారిని కలుసుకొని నేను తయారుచేసి

తెచ్చిన 'రామదాసు' కథను వినిపించి, సంభాషణలు వ్రాయిస్తున్న కాలంలో హైదరాబాదులో 'పోలీసు ఏక్షన్' వచ్చింది. దాంతో ఆ ప్రయత్నం జారిపోయింది. ఎలాగూ కథ వగైరాలు సిద్ధం చేసుకున్నాను గనుక నేనే స్వయంగా తీయాలన్న ఆలోచనతో 'రామదాసు' 1959లో ఆరంభించి. రామదాసులాగే ఎన్నో కష్టాలకు, నష్టాలకు, యిబ్బందులకు గురియ్యాను.

చిత్ర నిర్మాణకాలంలో ముఖ్యపాత్రధారులయిన కన్నాంబగారు గౌరీనాథశాస్త్రిగారు, సి. ఎస్. ఆర్. ఆంజనేయులుగారు, డాక్టరు జి. వి. సుబ్బారావుగారు చనిపోవడం నా దురదృష్టం. అందుచేత కొన్ని ఘట్టాలు-



జైహింద్ స్టూడియోస్ అధినేత శ్రీ ఎం. సత్యంను పుత్ర వాత్సల్యంతో కౌగలించుకుంటున్న శ్రీ నాగయ్య

ముఖ్యంగా కబీరు పాత్రధారి గౌరీనాథశాస్త్రిగారితో కూడు వంతులు పూర్తి అయిపోయాక వాటినంతా శ్రీ గుమ్మడి గారితో మొదటినుంచీ మళ్ళీ తీయాలసి వచ్చింది. ఈ కారణాలవల్ల ఆర్థికంగాకూడా నష్టపడ్డాను. అప్పులు చేశాను. చిత్రం పూర్తికావడానికి అయిదేళ్ళ కాలం పట్టింది. నేను కోరిన వెంటనే-నా మీద గౌరవంతో పాటు-ఈ చిత్రం బాగా ధనం సంపాదించి పెడుతుందని. ంతో నా ఋణబాధలు, కష్టాలు అన్నీ తొలగిపోయి నేనొక యిల్లు, కొంత పొలంకొని, జీవితశేషాన్ని ప్రశాంతంగా గడుపుకోవాలనే ప్రగాఢమైన విశ్వాసంతో పద్మశ్రీ ఎన్. టి. రామారావు, పద్మశ్రీ శివాజి గణేశన్, శ్రీమతి అంజలీదేవిగారలు 'రామదాసు' చిత్రంలో అతిథినటులుగా ముఖ్యమైన దేవతా పాత్రలను పోషించి చిత్రానికి శోభను చేకూర్చారు. ఇంకా పద్మశ్రీ ఘంటసాల వెంకటేశ్వర రావు, పి. బి. శ్రీనివాస్, మాధవపెద్ది సత్యం, శ్రీమతి టి. జి. కమలాదేవి అతిథి గాయకులుగా చిత్రానికి టైటిల్ సాంగ్ పాడారు. వీరందరికి నేను ఎంతో ఋణపడి ఉన్నాను. ప్రత్యేకించి తానీషా పాత్రను గొప్పగా పోషించిన ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు, కళాతపస్వి, నా పూజ్యమిత్రులు శ్రీ వసల సూర్యచంద్ర రావుగారు, మౌల్వీగా నటించిన శ్రీ రేలంగి బ్రహ్మయ్య గారు, సీతారామశాస్త్రిగా నటించిన కళామూర్తి విజయవాడలో న్యాయవాదిగా ఉన్న శ్రీ వి. రామన్నపంతులు గారు, హాస్యనట శేఖరులు శ్రీ అల్లు రామలింగయ్యగారు, ఛాయాగ్రాహకుడు శ్రీ కె. ఎస్. ప్రసాద్‌గారు 'రామదాసు' చిత్రంలో నాకు చేసిన మేలు నేనెన్నడూ మరువలేను. వీరందరికి నేను ఎంతో కృతజ్ఞుణ్ణి!....

చిత్రం 1964లో విడుదల అయింది. ప్రజలు దానిని ఎంతో ఆదరించారు. అది మంచి పేరు సంపాదించింది. ప్రాంతీయ పారితోషకాన్ని తెచ్చుకుంది. చిత్రం శతదినోత్సవంకూడా జరుపుకుంది. ధనమూ సంపాదించింది. కాని యింతవరకు నా చేతికి మాత్రం ఏమీ అందలేదు. పరిస్థితుల ప్రభావం హైకోర్టుదాకా వెళ్ళిందంటే నేనెంతో బాధ పడుతూ నా అభిమానులయిన మీ అందరికి తెలుపుకుంటున్నాను.

నేను ఎవర్నీ మోసంచేసి, అన్యాయంచేసి డబ్బు సంపాదించలేదు. నేను ఏ దుర్వ్యసనాలకులోనయి, విచ్చలవిడిగా, దర్జాగా ఖర్చు చెయ్యలేదు. లెక్కతెలియని గుప్తదానాలు ఎన్నో చేశాను. ఎన్నో విద్యాసంస్థలకు, జాతీయ సంస్థలకు, కళాపీఠాలకు విరాళాలు యిచ్చాను; పేదలకు దానాలు చేశాను. పేదలకు పెళ్ళిళ్ళు చేశాను. ఆంధ్రరాష్ట్రోద్యమ విజృంభణ సమయంలో ప్రకాశం పంతులు నాయకత్వం వహించినప్పుడు-'మద్రాసు నగరం ఆంధ్రులకు చేరాలి' అనే నినాదాలతో-ఉద్యమాలు నడిపించి-మద్రాసులో ప్రచారంకోసం 30 వేలరూపాయిల దాకా యిచ్చాను. ఈ విషయం అప్పుడున్నవారికి చాలా మందికి తెలుసు. కొందరు మరిచిపోయారు; యిలా దానాలవల్ల, మోసాలవల్ల ఆస్తినంతా పోగొట్టుకున్నాను. నేను చేసింది తప్పో, రైటో నాకు తెలియదు. ఏమైనా యివాళ నేను విచారించవలసి వస్తున్నది.

ఒక మనిషి దగ్గిర డబ్బువుంటేనే అందరూ గౌరవిస్తారు; అందలం ఎక్కిస్తారు. లేకపోతే అటువైపే చూడరు. ఇవాళ నేను ధనవంతుణ్ణికాను; సామాన్య కుటుంబీకుడిని. సినిమా పరిశ్రమలో నేను ఎన్నో ముఖ్య పాత్రలు ధరించి, పేరు, ప్రతిష్ఠలు సంపాదించి, యివాళ యీ చిన్న వేషాలు ఎందుకు వేస్తున్నావని చాలామంది నన్ను అడుగుతూవుంటారు. వారందరికి నా సమాధానం ఒక్కటే :... ఇప్పట్లో నేను అనుభవిస్తున్నది ఆర్థిక యిబ్బందులు, ఋణబాధలు; కాని యీ మాట చెబితే ఎవరూ నమ్మరు. నేను బాగా డబ్బు సంపాదించానని, దాచుకున్నానని చాలామందికి అభిప్రాయాలున్నాయి. ఆ అభిప్రాయాలతో నామీద ఎన్నో అపవాదులు, అభాండాలు లేచాయి. అయితే నిజానిజాలు నాకు, నా అంతరాత్మకు తెలుసు. నేను చనిపోయిననాడు శవదహన సంస్కారాలకు చందాలు పోగుచేయవలసిన సమయం వచ్చినప్పుడుగాని నిజం తెలియదు. కాని ఏనాటికైనా నా పెద్దరోజులుపోయి మంచి రోజులు వస్తాయని, అప్పట్లో 'రామదాసు' చెర విముక్తుడయినట్టే నేనూ ఋణవిముక్తుడ నవుతాననే గట్టి నమ్మకంతోనే నా కృషిని సాగిస్తున్నాను. ఆ రోజులొచ్చినప్పుడు అందరికీ సంతోషంగా తెలియజేస్తాను. నా ముప్పయి ఏడేళ్ళ సినిమా జీవితంలో నేను నిలవచేసుకున్నదల్లా మంచి పేరు, గౌరవ ప్రతిష్ఠలు మాత్రమే !.... పరిశ్రమలో చాలామంది నన్ను 'నాన్నగారూ' అని పిలుస్తూ గౌరవిస్తుంటే నేను మురిసిపోతుంటాను.

1948లో ఒకసారి అవసరంకలిగి అక్కినేని నాగేశ్వరరావుగారి దగ్గిర వెయ్యి రూపాయలు తీసుకున్నాను. ఆ తరువాత అది ఆయనకు తిరిగి యివ్వబోతే తీసుకోలేదు. నేను ఎంత బతిమాలినా అతను వద్దని నిరాకరించాడు. ఇప్పటికీ నేను 'నన్ను ఋణగ్రస్తుణ్ణి చేస్తున్నావు నాయనా' అంటూ వుంటాను. అతను ఆ విషయం మాట్లాడనివ్వడు. నామీద నాగేశ్వరరావుకు కల గౌరవానికి నేను ఎంతో సంతోషిస్తూ ఉంటాను.

1965లో నాకు 'పద్మశ్రీ' యిచ్చి భారత ప్రభుత్వం గౌరవించింది. యావత్తు దక్షిణ భారతదేశంలో ఆ గౌరవానికి నోచుకున్న మొట్టమొదటి సినిమా కళాకారుణ్ణి నేనే !....

నాకు పద్మశ్రీ వచ్చినట్లు తెలిసిన రోజున నాకు రేఖా అండ్ మురళీ వారి 'దేవత' షూటింగు. ఆ రోజున నేను సెట్ మీదకు వెళ్లగానే చిరంజీవి పద్మనాభం నాకు పట్టు వస్త్రాలు పెట్టి, పూలమాలలువేసి, ఘనంగా సత్కరించాడు. పద్మశ్రీ ఎన్. టి. రామారావుగారు, శ్రీమతి సావిత్రిగారు, పద్మశ్రీ జెమినీ గణేశన్‌గారు కూడా ఆ సెట్టుమీదే నాకు పూలమాలలువేసి, గౌరవించి, అభినందించారు. తరువాత ఎన్నిచోట్లల్లోనో నాకు అభినందన సభలు ఏర్పాటయినాయి. జైహింద్ సత్యం మద్రాసులో నాకు చేసిన సన్మానం నిజంగా ఘనమైనది. ఆనాటి సభను, ఆ సన్మానాన్ని నేను మరిచిపోలేను. తరువాత హైదరాబాదు వెళ్లినప్పుడు శ్రీ నాగేశ్వరరావు తన యింట బ్రహ్మాండమైన విందును యేర్పాటుచేసి, మిత్రులను ఆహ్వానించి, నాకు సన్మానసభ యేర్పాటుచేసి, అభినందించారు. రవీంద్ర భారతిలో చలనచిత్ర నిర్మాతలచే ఘనమైన సన్మానసభ ఏర్పాటు చేయించి ఎంతో గొప్పగా సన్మానించారు.

నా జీవితంలో నేను మరపురాని విశేషం-నా షష్ట్యబ్దపూర్తి మహోత్సవం. శ్రీ పుటపర్తి సత్య సాయిబాబా

తెలుగు చలనచిత్ర కళామతల్లికి యింతవరకు

అంజలివారు సమర్పించిన

## అమూల్య ఆభరణాలు



**అంజలి పిక్చర్సు**

- పరదేశి
- అనార్కలి
- సువర్ణసుందరి
- ఋణానుబంధం
- స్వర్ణమంజరి
- భక్త తుకారాం
- క్షేత్రయ్య

**చిన్నీ బ్రదర్సు**

- సతీసక్కుబాయి
- సతీసుమతి
- కుంకుమభరిణె
- అమ్మకోసం

నిర్మాత :

**పి. ఆదినారాయణరావు**

అంజలీ పిక్చర్సు

6, పగ్సు రోడ్డు, మద్రాసు-600028

## కీ॥ శే॥ నాగయ్య

రచన : పి. పుల్లయ్య

'కీర్తిశేషులు' అన్నమాట సార్థకమయ్యేది కొందరి పట్లే. ఆ మహామహుల కోవకు చెందినవాడు నాగయ్య. ఆయన బ్రతికి ఉండగా, "మీవాడు – మీ నాగయ్య" అనే వ్రాసేవాడు. ఆమాట అక్షరాలా నిజం. ఈ మనిషి ఎప్పుడో మనల్ని విడిచిపెట్టి పోయాడు. కాదు – ఆయన మనతోతోనే ఉన్నాడు! ఉన్నది ఆయన మంచితనం. ఉన్నది ఆయన కీర్తి – ఉన్నది ఆయన ప్రతిభ – ఉన్నది ఆయన కళాత్మక హృదయం. ఆయన జీవితమొక దిగ్విజయ యాత్ర: ఆయన ఒక అమరజీవి.

'నరం లేని నాలుక', 'ఎముకలేని చెయ్యి' అన్న ప్రశంసలు ఆయనకే చెల్లుతాయి. ఆయన నటించిన చిత్రాలలో, ధరించిన పాత్రలన్నిటిలో జీవించాడు. కాని జీవితమంతా నటించాడు. ఈమాట అపార్థం చేసుకోవద్దు. నాగయ్య తన, మన, తరతమ భేదాలు లేకుండా, ఆర్జించిన ధనమంతా పంచిపెట్టాడు. అది చాలక నటించాడు. అప్పో సప్పో చేసి, దానాలు చేశాడు. ఆయనకు అవధులు లేవు. ఆయన లేనివాడా? కాదు - కాదు - ఆయన ఎప్పటికీ ఉన్నవాడే! అదే ఆయన జీవితంలో నటన. నాగయ్య దేవుడి మనిషి. ఆ దేవుడిమీద నమ్మకంతోనే ఆయన బ్రతికాడు. ఆయనకు మిగిలింది దిగంతవ్యాప్తమైన కీర్తి!

తెరమీద నాగయ్య పోతన, వేమన, త్యాగయ్య, రామదాసు, ప్రేమికుడు, ప్రజాస్వామ్యుడు, శ్రేయోభిలాషి యింకా ఎన్నో ఎన్నో పాత్రలలో జీవించాడు. ఆయనది ఎప్పుడూ ప్రథమస్థానమే! ఆయనది అమృత గాథ. ఆయన సాటిలేని సంగీత దర్శకుడు, నిర్మాత, దర్శకుడు. ఇవేవీ ఆయన బ్రతికి వుండగా సాయపడలేదు. కీర్తి ఒక్కటే దక్కింది ఈ కీర్తిశేషుడికి!

'పద్మశ్రీ' బిరుదం సమర్పించారు ప్రభుత్వం ఈ కళాతపస్వికి. ఆయనే కళ – కళ ఆయనే! ఈ యోగికీ, త్యాగికీ ఒక శిలాప్రతిమను నిర్మించాలన్న శ్రీ ఇంటూరి ధన్యులు. ఆ పరమేశ్వరుని అందచేరుకున్న శ్రీ నాగయ్య గారికి నా నమోవాకములు.

---

నారు ఆ ఉత్సవం జరిపించారు. ఖర్చులన్నీ వారే భరించి, అతి వైభవంగా ఆ ఉత్సవం ఏర్పాటు చేశారు. లక్షలాది ప్రజలు ఆరోజు వచ్చి నన్ను అభినందించారు. పెద్దలెందరో నన్ను ఆశీర్వదించారు. నా ఆప్తమిత్రులు శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు నా షష్ట్యబ్దపూర్తి ఉత్సవ సందర్భంలో వారు నడుపుతున్న 'సినిమా' పత్రిక ప్రత్యేక సంచికను వెలువరించారు.

ఇంతవరకు నేను 300 చిత్రాల్లో నటించాను. తెలుగు, తమిళం, మలయాళం, కన్నడ భాషలతోపాటు హిందీలో కూడా నటించాను. ఇహ నాకు చిత్రాలలో ఎక్కువగా నటించాలన్న ఆశలేదు. విధిలేదు గనుక, ధన సంపాదన కోసం చిత్రాల్లో నటిస్తూ వస్తున్నాను. నా అప్పులు తీరి నన్ను నమ్ముకున్నవారికి ఒక దారి దొరికితే నేను సినిమాల నుంచి రిటైర్ అవుతాను. ఒక 'కళాపీఠం' స్థాపించి, సన్యాసాశ్రమంలోకి వెళ్లి శేష జీవితం గడపాలన్నది నా ఆకాంక్ష. పైవనిర్ణయం ఎలా ఉన్నదో!....

నన్నెందరో మహనీయులు ఆదరించారు; అభిమానించారు. ఎందరో పెద్దవారి సాంగత్యం లభించింది. ఎందరో మహానుభావులు నాకు ఒకబాట చూపి, నడిపించారు. వారందరికి నేను చేతులెత్తి సవినయంగా నమస్కరిస్తున్నాను. నా నటనను ప్రోత్సహించిన అశేష ప్రేక్షక మహాశయులకు, పత్రికా రచయితలకు నేను కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

నా స్వీయచరిత్ర యిచ్చే సందేశము, నీతి ఏమిటంటే– 'తనకు మాలిన ధర్మం కూడదు' అని. తనకు మాలిన ధర్మం చెయ్యడం నిజంగా గొప్ప విషయమే!.... కాని పూర్వపు రోజుల్లో అయితే అలాచేసినందుకు ఫలం అనుభవించగలిగేవాడు. ఈనాటి యీ స్వార్థ ప్రపంచంలో 'తనకు మాలిన ధర్మం' కూడదు. అది ఆ వ్యక్తిని నాశనం చేస్తుంది. నేను అలాగే చెడ్డాను. సంపాదించిన దాంట్లో వెనక వేసుకోకుండా ఏ దానము, సహాయము ఎవరికీ చెయ్యకండి!... ప్రతి మనిషి చెప్పే తియ్యని కబుర్లు నిజమని నమ్మకండి!...తెల్లగా ఉన్నంత మాత్రాన నీళ్లను చూచి పాలని భ్రమించకండి!....భ్రమ కలిగినా నిశితంగా పరిశీలించి, అవునో కాదో తేల్చుకోండి!....ఇదే నేను అందరికీ సవినయంగా మనవి చేసే విషయం. స్వానుభవంతో నేను తెలుసుకున్న పరమ సత్యం యిది. నేను యివాళ యిన్ని అవస్థలు పడడానికి కారణం ఆ 'సత్యం' తెలుసుకోక పోవడమే!...

WE PAY

OUR HOMAGE

TO THE SACRED MEMORY OF

LATE PADMASHRI

**CHITTOOR V. NAGAYYA**

**'PAULMUNI'**

OF INDIA



★

# *SIVAM PROCESS*

(Proprietor: V. THANDAVAM)

Manufacturers:

Colour Blocks, Cine & Commercial Designs, Quality Printings, Photographic Enlargements, Cinema Slides.

***2, THAYAR SAHIB STREET, MOUNT ROAD,***

**MADRAS - 600 002.**

Phone: OFFICE - 89606
RESIDENCE - 446744

# నాన్నగారు!

రచన: అంజలీదేవి

'నాన్నగారూ!' అని పితృభక్తిభావంతో పిలిచేదాన్ని నేను.

'అమ్మాయీ' అని అవ్యాజానురాగాలతో పిలిచేవారు నన్ను అమరజీవి శ్రీ నాగయ్య నాన్నగారు.

అటువంటి మమతానుబంధాలతో మెలిగాం మేము. ఏదో అనుబంధం, ఏదో ఆత్మీయత పెనవేసుకున్నాయి మమ్మ. నిత్యమూ ఆ ముఖంపై చిరునవ్వు చిందులాడుతూ వుండేది. ఎన్ని కష్టాలు విరుచుకు పడినా చలించక గంభీరంగా చిరునవ్వుతో భరించిన ధీశాలి.



"సర్వేజనా సుఖినో భవంతు" అన్న వేద సూక్తిని పాటిస్తూ 'అందరూ బాగుండాలి' అన్న ఆకాంక్షతో పరిశ్రమలోని ప్రతివారికి అభిమానపాత్రమయిన మహామనీషి. అజాతశత్రువు.

వెన్నపూసవంటి మనసు. ఒకరి కష్టాలు చూసి కరిగి పోయే సరళ హృదయుడు. ఆరోజులు నేను మరిచి పోలేను. 1964లో 'ఫూలోంకి సేజ్' అన్న హిందీ చిత్రాన్ని తీసి అపారమైన కష్టనష్టాలకు గురియై మానసికంగా బాధపడుతోన్న రోజులు. చిత్రపరిశ్రమలో సానుభూతి వాక్యాలు పలికేవారే కరువైన రోజులు. ఆ గడ్డు రోజుల్లో శ్రీ నాగయ్యనాన్నగారు మావద్దకు వచ్చి, మా కష్టసుఖాలు తెలుసుకుని, చాలా మధనపడి, మమ్మల్ని శ్రీ సత్యసాయిబాబావారి దర్శనం చేసుకొనమని సలహా యిచ్చారు. అప్పటికి బాబావారి పేరు వినడమే కాని, వారిని చూడనైనా చూడలేము. అయితే శ్రీ నాగయ్యగారు తాము ఎలాగా బాబావారి ఆశీస్సుల బలంతో 'భక్త రామదాసు' చిత్రాన్ని పూర్తి చేశారో వివరంగా చెప్పి, తామే బాబావారి దర్శనం చేయిస్తానని వాగ్దానం చేశారు. శ్రీ బాబావారు ఒకసారి మద్రాసు వచ్చినప్పుడు నాన్నగారు మమ్మల్ని తీసుకు వెళ్లి బాబావారి దర్శన భాగ్యం కలుగ చేయించారు. నిజంగా అది మా జీవితానికి మలుపుగా, మా నిరాశా హృదయాలకు ఒక దివ్య జ్యోతిగా పరిణమించింది. ఆనాడు నాగయ్య నాన్నగారు శ్రీ బాబావారి దర్శనం చేయించి వుండకపోతే మా భవిష్యత్తు ఎలా వుండేదో ఊహించుకోవడం కష్టం. అటువంటి అపారమైన ప్రేమాభిమానాలు మామీదు చూపించిన సహృదయులు. మాకేకాదు అనేకమందికి ఆయన తనచేతనైన సహకారాన్ని అందజేసి తన హృదయ వైశాల్యాన్ని, పరహితాభిలాషను వ్యక్తం చేసిన మహామనీషి.

శ్రీ నాగయ్య నాన్నగారు "భక్త రామదాసు" చిత్రం తీస్తున్నప్పుడు నాదగ్గరకు వచ్చి 'అమ్మాయీ, రామదాసు చిత్రం ఎలాగో కష్టపడి తీస్తున్నాను. నీవు మహాలక్ష్మి పాత్ర ధరించాలమ్మా. చిరంజీవి మన నాగేశ్వరరావుని మహావిష్ణు పాత్రకు అడుగుతాను' అని అనగా 'అలాగే నాన్నగారూ' అని అంగీకరించగా ఆయన పితృవాత్సల్యం ఫుట్టిపడేలా ఆనందించి, ఆనందబాష్పాలు రాల్చారు. ఆ దృశ్యాన్ని యీనాటికీ మరువలేను. ఆ చిత్రం ఎంతో విజయవంతంగా నడిచినా, విధి వక్రించి దాని సత్ఫలితాలు ఆయన అనుభవించలేని దురదృష్టం ఆయన్ని వెన్నాడింది. ఆయన విధివంచితులని అనుకున్నాను.

హృదయాన్ని కదిలించే మరో సన్నివేశాన్ని తలుచుకోకుండా వుండలేను. 1960లో మేము క్రొత్తగా కట్టిన యింట్లో గృహప్రవేశానికి శ్రీ నాగయ్య నాన్నగారికి ఆహ్వానం పంపాము. ఆ రోజుల్లో ఆయన ఆర్థిక పరిస్థితులు అంతగా బాగాలేవు. సాధారణంగా యిటువంటి ఫంక్షన్స్‌కు తరుచుగా వెళ్లడానికి కూడా మనస్థిమితం లేని గడ్డు రోజులు. అయినా గృహప్రవేశంనాడు శ్రీ నాగయ్య

Our Homage to

Late PADMASRI CHITTOOR V. NAGAYYA Whose Contribution to the Advancement of the South Indian Film Industry is truly incalculable and whose voice would echo through the corridors of time and his shadow lengthen across the

GLOBE




# VISWASANTHI PICTURES

**HABIBULLAH ROAD, MADRAS - 600 017.**

PRODUCER - DIRECTOR :

*U. Visweswara Rao*



'సుమంగళి'లో వృద్ధుని పాత్రలో శ్రీ నాగయ్యా

నాన్నగారు నవ్వుతూ వచ్చారు. మేము ఆయనకు నమస్కరించాము. ఆయన మమ్మల్ని దీవిస్తూ అలిమేలుమంగ సహిత శ్రీ వెంకటేశ్వరస్వామివారి వెండి మలాముచేసిన విగ్రహాలు కల పటాన్ని బహూకరిస్తూ 'యీ బీదవాడు యింతకంటే ఏం యివ్వగలడు' అని గాద్గదిక స్వరంతో కనులు చెమ్మగిలగా అంటుంటే మా కళ్లల్లో నీళ్లు తిరిగి, ఏమి అనాలో తెలియక 'నాన్నగారూ—మా యిలవేల్పు నిచ్చారు. యింకేంకావాలి మాకు. దీన్ని భద్రంగా దాచుకుంటాం' అని వారి ఔదార్యాన్ని కొనియాడాను. ఆయన పరమానందభరితులయి చాటంత ముఖం చేసుకున్నారు. నా తలపై తమ చేతితో నిమురుతూ ఆయన కిచ్చిన నాగ్దానమే అనుకోండి. మరేమన్నా అనుకోండి. ఇప్పటికీ శ్రీ నాగయ్యానాన్నగారిచ్చిన ఆ శ్రీ వెంకటేశ్వరుల పటం మా పూజామందిరంలో అధిష్ఠించి పూజింపబడుతున్నది. అది చూచినప్పుడల్లా నాన్నగారు జ్ఞాపకం వస్తూంటారు.

శ్రీ నాగయ్యానాన్నగారితో మాకున్న అనుబంధాల్ని చెప్పాలంటే చోటు చాలదు. వారు ఒక గంభీరమూర్తి; మూర్తికి తగిన స్ఫూర్తి: అందరినీ ఆకట్టుకున్న సౌమ్యమూర్తి: తెలుగు చిత్రసీమకు ధృవతార. ఆ తార యీనాటికీ పల్లెపల్లెలా తన దివ్యదీప్తులను వెదజల్లుతూ నీరాజనాలందుకుంటూ వుంది. అవి ఆరని జ్యోతి: అమర జ్యోతి.

ఆయన కాంస్య విగ్రహాన్ని యీనాడు మద్రాసులో నెలకొల్పుతూ, ఒక మంచి కార్యానికి నాంది పలికి, ఒక మహనీయుని దివ్యస్మృతికి అంజలి ఘటిస్తున్న మా తెలుగు సినీ ఆర్టిస్టుల అసోసియేషన్‌కు నిండు మనసుతో నివాళులర్పిస్తున్నాను

మహానటులు స్వర్గీయ
పద్మశ్రీ నాగయ్య
దివ్య స్మృతికి
మా జోహార్లు

త్వరలో వస్తోంది!...

మహత్తర పౌరాణిక వర్ణ చిత్రం

పద్మలక్ష్మి కంబైన్స్ వారి

# శ్రీ రేణుకాదేవి మహాత్మ్యం

తారాగణం :

పద్మశ్రీ బి. సరోజాదేవి, కుమారి మంజుల మొదలయినవారు

దర్శకత్వం - సి. ఎస్. రావు : సంగీతం - ఎస్. హనుమంతరావు

---

పద్మలక్ష్మి కంబైన్స్,

14, విజయరాఘవాచారి రోడ్, మద్రాసు - 600017

# అమరజీవి శ్రీ నాగయ్య

రచన :
పి. ఆదినారాయణరావు

'నాగయ్య నటనలో నాణ్యమెరుంగక 'సైగలు' నటనకై సంభ్రమేల' ... ఈ పద్యం 1944లో కాకినాడ 'ఎంగ్ మెన్స్ హాపీ క్లబ్' వారు ప్రదర్శించడానికి నేను రాసిన 'వీధి గాయకులు' అనే నాటకంలోనిది. ఆ నాటికే శ్రీ నాగయ్యగారు తన మధురగానంతో, మహోన్నత నటనా చాతుర్యంతో నా హృదయంపై గాఢ ముద్ర వేశారు.

శ్రీ నాగయ్యగారి సినిమారంగ ప్రవేశంతో తెలుగు సినిమా సంగీతం సరికొత్త వెలుగు, జిలుగులకు సంతరించుకుంది. అవి కలకత్తా న్యూ థియేటర్స్ చిత్రాల్లోని సంగీతం ప్రజల్ని ఊపివేస్తున్న రోజులు. శ్రీ నాగయ్యగారు ప్రజాభిరుచుల్ని పసికట్టి ఆ బాణీలలోని మెలకువలను, చెణుకులను తమ సంగీతపు బాణీలలో ప్రవేశపెట్టి, తెలుగు సినిమా సంగీతానికొక కొత్త వరవడి దిద్దారు. ఆయన చూపిన పంథా తరువాత వారికెందరికో మార్గదర్శకమయింది.

'వందేమాతరం', సుమంగళి', 'స్వర్గసీమ', 'పోతన', 'త్యాగయ్య' వంటి మహోన్నతమైన కళాఖండాలను తన సుమధుర సంగీత సుధలతో రసతరంగితంచేసి, తన కీర్తిని దిగంతాల వ్యాపింపచేసుకుని అమరుడైనారు. ప్రేక్షకుల మనసులను ఆకట్టి జోకొట్టే రసపు పటులు శ్రీ నాగయ్యగారి సంగీత దర్శకత్వంలో ప్రత్యేకతలు: అవి అనితర సాధ్యాలు.

తెలుగునాడులోనే కాకుండా తమిళనాడులో కూడా శ్రీ నాగయ్యగారి కీర్తి, ప్రతిష్ఠలు విజయపతాకాన్ని ఎగుర వేశాయి.

శ్రీ నాగయ్యగారి సంగీత మాధుర్యానికి వశుడనైన నేను ఆయనవద్ద శిష్యరికం చేయాలని ఉబలాటపడ్డాను.

ఆ ఆవేశాన్ని అణుచుకోలేక 1941లో మిత్రుల ప్రోద్బలంతో మద్రాసుకు వచ్చాను. 'సుమంగళి' హీరో శ్రీ గిరి గారికి మిత్రులు నన్ను పరిచయం చేయగా ఆయన నన్ను శ్రీ నాగయ్యగారికి అసిస్టెంటుగా రెకమెండ్ చేశారు. అప్పటికే 'దేవత' విడుదల అయింది. తరువాత చిత్రం కోసం సమాలోచనలు జరుగుతున్నాయి. శ్రీ నాగయ్యగారు నన్ను 2, 3 నెలల తరువాత రమ్మన్నారు. అయితే మళ్లా నేను వెళ్ళడం జరుగలేదు. కాని ఆయనంటే నాకు ఎనలేని గురుభావం ఏర్పడది. తరువాత 1946లో నేను సినిమా రంగంలో 'పల్లెటూరి పిల్ల' చిత్రానికి కథారచయితగా, సంగీతదర్శకుడుగా ప్రవేశించి, 1949లో చిత్ర నిర్మాతగా నిలద్రొక్కుకున్నాను.

1954లో 'అనార్కలి' చిత్రం నిర్మింపదలచి శ్రీ నాగయ్యగారిని ఆ చిత్రంలో 'మాన్‌సింగ్' పాత్రను వేయమని అర్థించడానికి వెళ్లాను. ఆయన అమందానందంతో నన్ను కౌగలించుకుని "తప్పకుండా వేస్తాను అబ్బాయిగారు' అని వాగ్దానం చేశారు. 'అయితే వ్యాపార రీత్యా ఆయన్ను ప్రతిఫలం ఏమి ముట్టజెప్పమంటారు' అని అడిగేసరికి ఆయన విచలితుడయినట్టు రియాక్ట్ అయి "నో, నో, నేనేం చెప్పను. మీరిచ్చినంత పుచ్చుకుంటాను. అంతే" అని మరి మాట్లాడనివ్వాడుకాదు. ఆ తరువాత ప్రతిఫలం నేనేమి యిచ్చానో, ఆయనేం పుచ్చుకున్నారో మా యిద్దరిలోనే వుండిపోయింది. అలాగే మళ్ళీ 'స్వప్నసుందరి' చిత్రంలో ఒక ప్రముఖ పాత్రను నాగయ్యగారిని కోరగా అంగీకరించడమే కాకుండా ప్రతిఫలం విషయంలో మళ్ళీ మాకే వదిలివేశారు. అటువంటి ప్రేమాభిమానాలను మాయందు చూపిన స్నేహశీలి, విశాల హృదయులు. ఆయనొక గంభీరమూర్తి; నిరాడంబరుడు; నిస్వార్థ జీవి. ఏ నిర్మాత అడిగినా ప్రతిఫలాపేక్ష లేకుండా తన సహకారాన్ని అందజేసిన ఉత్తమ కళాకారుడు.

OUR HOMAGE TO THE MEMORY

OF THE 'KARMA YOGI'

OF THE SOUTH INDIAN FILM FIELD

LATE PADMASRI CHITTOOR V. NAGAYYA

V

# Dr. GIRI FURNITURE

(FURNITURE HIRERS)

72/1-L, Varadarajapet Main Street

CHOOLAMEDU : : MADRAS - 600 094.

( Near LIBERTY THEATRE )



భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధితో శ్రీ నాగయ్య. వారి అర్ధాంగి శ్రీమతి జయమ్మ. వారి మరదలు శ్రీమతి కమలా చంద్రబాబు...

శ్రీ నాగయ్యగారు ఒక తీరని కోరికతో అస్తమించారు. ఆ తీరని కోరిక నాలోకూడా ఉండిపోయింది. చివరి రోజుల్లో ఆయనతో "కృష్ణలీలలు" చిత్రంగా తీయాలనే కుతూహలం ఉండేది. దానికి స్క్రిప్టు కూడా తయారు చేసుకున్నారు. మద్రాసులోని వీనస్ పిక్చర్స్‌వారితో సంప్రదింపులు జరిపారు. ఆ సమయంలో ఆయన నన్ను తన "కృష్ణలీలలు" చిత్రానికి సంగీతాన్ని సమకూర్చమని అడిగారు. నా అదృష్టం అంటూ నా అంగీకారాన్ని ఆయనకు అందజేశాను. కాని యిద్దరం విధి వంచితులం అయ్యాం. ఆయన సారథ్యంలో సంగీత దర్శకత్వం వహించే భాగ్యం నాకు దక్కకుండా పోయిందే అని బాధ పడ్డాను.

నిజం చెప్పాలంటే శ్రీ నాగయ్యగారు లోకారాధ్య నీయులయిన కళారాధకులు. కళాస్రష్ట, కళారాధకుడు అనే పదం ఆయన కొక్కడికే చెందుతుందేమోననిపిస్తుంది. ఎందుచేత?.... ఏ నిర్మాతవద్ద తనకు "యింతకావాలి, అంత కావాలి" అని యీనాటి కళాకారులలాగా డిమాండ్ చేసి ఎరుగని నిస్వార్థపరుడయిన కళాజీవి. కళను కాసుకు అమ్మని నిజమైన కళారాధకుడు ఆయన. కళారాధన తన ఆనందంకోసం, ఆత్మ తృప్తికోసం అభ్యాసం చేసుకున్న కళాతపస్వి. తాను ఆర్జించిన లక్షలాది ధనాన్ని గుప్త దానాలకై వెచ్చించిన త్యాగమయుడు. తన అసమాన నటనా పటిమను దిగ్దంతాల వెదజల్లి, అమరమైన కీర్తి నార్జించిన అమరజీవి శ్రీ నాగయ్య!....ఆయన కాంస్య విగ్రహాన్ని మద్రాసులో నెలకొల్పుతున్న తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ వారికి నిండుమనసుతో అభినందనలు అర్పించుకుంటాం.



తెలుగు సినిమా చరిత్రలో ప్రత్యేక అధ్యాయానికి ప్రాణప్రతిష్ఠ
సలిపిన మహానటులు, గాయకులు స్వర్గీయ పద్మశ్రీ
చిత్తూరు వి. నాగయ్య దివ్యస్మృతికి
మా జోహార్లు . . .



★

తెలుగు సినీ ఆర్టిస్ట్సు అసోసియేషన్,

తిలక్ స్ట్రీట్, త్యాగరాయనగర్, మద్రాసు–600 017.



## శ్రీ బి. పద్మనాభం:



"పూజ్యులు, పితృ సమానులు పద్మశ్రీ నాగయ్యగారు నాటక, సినిమా కళలకే కళాకాంతులు విరజిమ్మిన అపర నటరాజు!....

'యోగి వేమన', 'భక్త పోతన', 'త్యాగయ్య', 'భక్త రామదాసు' లను-భారత జాతి స్తుతించినంతకాలం-తన అసమాన నటనా శక్తితో-ఆ మహనీయులకు ప్రాణప్రతిష్ఠచేసి మెప్పించిన యీ మహనీయుడు జీవించియే ఉంటాడు!...

తన హృదయ ఫలకంలో సరస్వతీదేవికి స్థానమిచ్చి, పవిత్ర హస్తాలతో శ్రీ మహాలక్ష్మిని దానమిచ్చి విడిచిపెట్టిన అపరకర్ణుడు...

ఆ అమరమూర్తి ఆస్తి-చిరునవ్వు దయ, త్యాగము, సేవ, సహాయం, నిస్వార్థం, వైరాగ్యం, ప్రేమ, భక్తి!....

ఆ ధన్యజీవి భావి కళాకారులకు పూలబాట! ... జ్యోతిర్మయా-పద్మశ్రీ నాగయ్యా నమోనమః!....

చరణదాసుడు-విధేయుడు-పద్మనాభం!...."

## శ్రీ ఠాకూర్ పి. హరిప్రసాద్,

స్థాపక సంపాదకులు "సినీ ఓం హెరాల్డ్". అధ్యక్షులు అఖిలభారత లఘు వార్తా పత్రికల సంఘం.



"తెలుగు చలనచిత్రరంగంలో ధ్రువతారగా వెలుగొంది, అనితర సాధ్యమైన విభవాన్ని సాధించి, ప్రజాభిమానాన్ని చూరగొని, వదాన్యతతో కీర్తిసముద్రుడై, గానాభినయ విద్యలో ఆరితేరిన నటుడై, భక్తపాత్రలకు పళంపదుడై యశశ్శరీరుడైన పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారి విగ్రహప్రతిష్ఠకోసం అహరహం శ్రమించి, నాగయ్య స్మారక నిధి కార్యదర్శిగా శ్రీ ఇంటూరి కావించిన సేవ గణనీయం. ఈ కార్యక్రమానికి ఉత్తమ పత్రికా రచయితగా ఫిలిం రంగానికి సేవచేసిన శ్రీ ఇంటూరికీ అభిప్రాయం రావడం, దానిని చేపట్టి నిర్వహించడం నాకు ఆనందంగా ఉంది. తెలుగు చలనచిత్ర చరిత్రకు పెంపుడు స్థానమైన మద్రాసు నగరంలో, కళాకారులకు నిలయమైన త్యాగరాయ నగర్‌లో, తెలుగు సాహిత్యపు గుబాళింపులకు ఆలవాలంగా మెసలిన పానగల్లు పార్కువద్ద మహానటుడు నాగయ్యగారి విగ్రహప్రతిష్ఠకు తమిళనాడు ప్రభుత్వం స్థలం అందజేయడం, అక్కడి అందరి సహాయ సహకారాలతో విగ్రహప్రతిష్ఠ కావించడం చారిత్రక ప్రాధాన్యంకల సంఘటన. తెలుగు చలనచిత్ర వైభవాన్ని, నాగయ్యగారి విగ్రహం ఎల్లవేళలా ప్రసారిస్తూ కళాకారుల కర్తవ్యాన్ని, పరిశ్రమ ప్రమాణాలను గుర్తుచేస్తూ ఉండగలదని ఆశిస్తున్నాను. కీర్తికాయులు నాగయ్యగారు కథానాయకులుగా, సంగీత దర్శకులుగా తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ఎనలేని సేవచేసిన వ్యక్తి నిర్మాతగాకూడా ఆయన ఉదాత్త చిత్రాలను అందించారు. తెలుగునాట భక్తిరసాన్ని ప్రవహింపజేసిన నటపతంసుడాయన. పోతనగా, త్యాగయ్యగా, వేమనగా, రామదాసుగా నాగయ్యగారు అజరామరుడు. చేతికి ఎముక లేనట్లు దానంచేసి తన ఆర్జనకేకాక ప్రయోజనాన్ని, తన కళాభిరుచికేకాక విశిష్టతను, తన నటనాశక్తికేకాక పవిత్రతను కూడ సంతరించుకున్న ఆ మహా మహునికి నా వినమ్ర స్మారకాంజలి అర్పిస్తున్నాను. నాగయ్యగారి విగ్రహ ప్రతిష్ఠద్వారా తెలుగు చలనచిత్ర పరిశ్రమకొక సుస్థిరస్థానాన్ని చెన్నపట్టణంలో నెలకొల్పిన నాగయ్య స్మారక నిధి కార్యకర్తలకు నా అభినందనలు. తెలుగు పరిశ్రమకు సంబంధించిన అన్ని కార్యక్రమాల్లోను ఏకోన్ముఖతకు, ఐక్య స్ఫూర్తికి నాగయ్యగారి విగ్రహ ప్రతిష్ఠా సంఘటన సుదృఢస్థాయిసందు కొనగలదని భావిస్తున్నాను."



## శ్రీ దుక్కిపాటి మధుసూధనరావు :

" దక్షిణభారత సినిమా ప్రపంచం గర్వించదగ్గ మహా నటులలో పద్మశ్రీ చిత్తూరు నాగయ్యగారు ప్రధములని నా అభిప్రాయం. పోతన, వేమన, త్యాగయ్య, రామదాసు పాత్రలను వారు ప్రజ్ఞాప్రాభవాలతో పోషించి, ఒక చరిత్రను సృష్టించారు. వారిది "రాళ్లకరిగించు విమల గంధర్వగానం!" వారి కాంస్య విగ్రహాన్ని మద్రాసు, పానగల్ పార్కు ఈశాన్యభాగంలో ప్రతిష్ఠించడానికి తెలుగు సినీ ఆర్టిస్టుల అసోసియేషన్ ముందుకురావడం గొప్ప విషయం. విగ్రహ ప్రతిష్ఠాపనా మహోత్సవం దిగ్విజయంగా జరగాలని నేను కోరుతున్నా."

## శ్రీ డి. రామానాయుడు :

" పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారు బహుముఖ ప్రజ్ఞాన్వితుడు. దక్షిణభారత చలనచిత్ర చరిత్రలో ఒక మహానటుడుగా, సంగీత దర్శకుడుగా, దర్శకుడుగా, నిర్మాతగా వారి నామం సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందని నా అభిప్రాయం. మద్రాసులో ఆ మహామహుని కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి తెలుగు సినీ ఆర్టిస్టుల అసోసియేషన్‌వారు పూనుకోవడం హర్షనీయమైన విషయం. వారి శిలావిగ్రహం నటలోకానికి ఒక దీపస్తంభంగా వెలుగొందాలని నా కోరిక."

## శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి :

" దక్షిణ భారత చిత్ర జగత్తులో భక్తుల పాత్రలను ప్రజ్ఞాప్రాభవాలతో పోషించిన ఘనత స్వర్గీయ శ్రీ చిత్తూరు వి. నాగయ్యకు దక్కింది. పోతన, వేమన, త్యాగయ్య, రామదాసు పాత్రలకు రూపకల్పన చేయడంలో ఆయనకు ఆయనే సాటి. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా విశ్వదాభిరామ వినురవేమ' అన్న పద్యానికి ఆయన ప్రత్యక్ష సాక్ష్యం. ఆ నట తపస్వి దివ్యస్మృతికి నా జోహార్లు."



## శ్రీమతి ఛాయాదేవి :

" స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్యగారు నాకు పితృ సమానులు. వారిది వెన్నపూస మనసు, కన్నతల్లి ప్రేమ. పండంటి వారి మోముపై బ్రహ్మతేజస్సు ఉట్టిపడేది. ప్రత్యేకంగా భక్తి రసంతో కూడుకున్న పాత్రలు ఆయనను వరించాయి. పోతన, వేమన, త్యాగయ్య, రామదాసులను ఆయన మనందరికి సాక్షాత్కరింప జేశారు. ఆ కర్మయోగి దివ్యస్మృతికి నా జోహార్లు. వారి కాంస్య విగ్రహం సినిమా నటలోకానికి దీపస్తంభపు వెలుగును చూపెట్టాలని నా ఆకాంక్ష."

## శ్రీ భట్టిప్రోలు మధుసూదనరావు, శ్రీ మొహద్దీన్‌బాషా:

"మరపురాని మహానటులు, గాయకులు, సంగీత దర్శకులు, దర్శకులు, చిత్రనిర్మాత, భారత స్వాతంత్ర్య సమరయోధులు స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య నిలువెత్తు కాంస్య విగ్రహం మద్రాసులో ప్రతిష్ఠింపబడుతుండడం చరిత్రలోకి ఎక్కవలసిన విషయం. ఆ కర్మయోగికి మా నమస్సులు."

## శ్రీ ధూళిపాళ:

"సృష్టి విచిత్రమైనది; కొందరు మహావ్యక్తులు, ఏదో కించిత్ మోగ భ్రష్ఠతవలన మానవులుగా అవతరిస్తారు. మృత్యువునకు, తరి తమభేదం లేదుగనుక వారుగూడ కాలగర్భంలో కలవక తప్పదు. కాని వారు మాత్రం, సర్వదా, శతధామృతజీవులే. వారిని గురించి కథలుగా చెప్పుకొని లోకం స్మరిస్తూనే వుంటుంది. అట్టి మహావ్యక్తులలో– ముఖ్యంగా నటలోకంలో కీ॥ శే॥ శ్రీ చిత్తూరు వి. నాగయ్యగారొకరు.

శ్రీ నాగయ్యగారు బహుముఖ ప్రజ్ఞాశాలి; సాధుగుణ సంపన్నులు; ఉదారస్వభావులు; నటతపోనిష్ఠా గరిష్ఠులు; వారు ఒక మహోద్గ్రంథం; ఒక విశ్వవిద్యాలయం; సాటిలేని మేటినటులు, మహోత్కృష్టమైన, ఉదాత్త పాత్రలకు ప్రాణప్రతిష్ఠ సలిపి, అన్యులకిసాధ్యమని చాటిచెప్పిన నటబ్రహ్మ. శరీరము, శారీరము, నటన, జన్మతఃవారికి భగవంతుడనుగ్రహించిన వరప్రసాదాలు. వారి మరణానికి చింతిస్తూ, మనసా, వాచా, కర్మణా వారికి అంజలి ఘటిస్తూ, ఆరాధించుకోవడమే యీతరం నటీనటులకు మిగిలింది. అట్టి మహా వ్యక్తియొక్క మహోత్కృష్టతను, వారు గతించిన తర్వాతనైనా గ్రహించి శిలా ప్రతిమను నిర్మించుట మహద్భాగ్యం. కార్యకర్తలకు, ముఖ్యంగా ఇందులకు దీక్షా కంకణధారియైన శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారికీ నా కృతజ్ఞతలు....



## శ్రీ బి. విఠలాచార్య:

"నాగయ్యగారు పుట్టుకతోనే మహా నటులని నా అభిప్రాయం. వారు కారణ జన్ములు. వారి దాతృత్వం చరిత్రలోకి ఎక్కదగ్గది. వారి కాంస్య విగ్రహం మద్రాసులో ప్రతిష్ఠింపబడడం సినిమా లోకానికి గర్వకారణం."

## శ్రీ పి. మంగపతి, గ్రామఫోను కంపెనీ ఆఫ్ ఇండియా, మద్రాసు.

"మహానటులు, గాయకులు స్వర్గీయ పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య కాంస్య విగ్రహం యీనెల 28వ తేదీ తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ చేత మద్రాసు, పానగల్ పార్కు యీశాన్య భాగంలో ప్రతిష్ఠింపబడుతోందని వినడానికి నాకు ఎంతో సంతోషంగా ఉంది. వారిచ్చిన గ్రామఫోను రికార్డులు ఒకప్పుడు దక్షిణ భారతంలో వేడి రొట్టెల్లాగా అమ్ముడు పోయాయి. ఆ మహామహుని దివ్యస్మృతికి నా జోహారు !...."

నటలోకానికి మకుటంలేని మహారాజు స్వర్గీయ పద్మశ్రీ

చిత్తూరు వి. నాగయ్య దివ్యస్మృతికి

నా జోహార్లు....

పి. వి. రమణయ్య

ప్రొప్రయిటరు : విజయకృష్ణా ఫిలిమ్స్.

8, త్యాగరాయ గ్రామణి వీధి.

మద్రాసు-600 017.

# కళాతపస్వి నాగయ్యగారు !

రచన :
మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

సినిమాల్లోకి రాకపూర్వం నాగయ్యగారు నాటకాల్లో ఎన్నో పాత్రలు ధరించేవారు. చిత్తూరు రామవిలాస సభలో ఆయన ధరించిన కబీరు పాత్రకు మంచిపేరుండేది. జిల్లా బోర్డు ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం చేస్తూనే ఒక ప్రక్క నాటకాలలో పాల్గొంటూ మరోప్రక్క ఆంధ్రపత్రిక విలేఖరి గావుంటూ వుండేవారు. చిన్నతనంలోనే భార్య పోవడం వల్ల విరక్తిచెంది నాగయ్యగారు కొంతకాలం ఆశ్రమాలలో కాలాన్ని వెళ్ళబుచ్చారు. ఆ తరువాత ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని దుర్భర జీవితాన్ని అనుభవించారు.



చలన చిత్రపరిశ్రమ తప్పటడుగులు వేస్తున్న సమయంలో చలన చిత్రపరిశ్రమనుండి ఆయనకు ఆహ్వానం వచ్చింది. హెచ్. యం. రెడ్డిగారు నిర్మించిన గృహలక్ష్మి చిత్రంలో గోపీనాథ్ పాత్రలో ప్రప్రథమంగా పరిచయమైనారు. ఆ చిత్రంలో ఆయన స్వంతంగా పాడిన "కల్లు మానండోయ్ బాబు, కళ్ళు తెరవండోయ్ బాబూ" అనే పాట ఆయనకు అఖండమైన కీర్తి, ప్రతిష్ఠలను చేకూర్చిపెట్టింది. దానితో ఆయనకు వాహినీ సంస్థనుండి ఆహ్వానం వచ్చింది. బి.ఎన్. రెడ్డిగారు నిర్మించిన 'వందేమాతరం'లో ఒక మంచి పాత్రను ధరించారు. తన నటనా సౌందర్యంతో ప్రేక్షకులందర్నీ ఆకట్టుకున్నారు. తరువాత వరుసగా వాహినీ సంస్థలో చేరి, దేవత, సుమంగళి, స్వర్గసీమ, పోతన, వేమన మొదలైన చిత్రాలలో విభిన్న పాత్రలు ధరించి, క్యారెక్టర్ నటుడుగా అసమానమైన కీర్తిని ఆర్జించుకున్నారు.

పోతన, వేమన, త్యాగయ్య, రామదాసులాంటి ప్రసిద్ధ పాత్రలు ధరించి, వాటన్నిటినీ నిండుగా పండించుకుని సాటిలేని మేటినటుడుగా వెలుగొందారు శ్రీ నాగయ్యగారు.

త్యాగయ్య చిత్రాన్ని ఆయన తన సర్వస్వాన్ని ఒడ్డి నిర్మించారు. ఈ చిత్రానికి నిర్మాతగా, దర్శకుడుగా, త్యాగయ్యగా, సంగీత దర్శకుడుగా, నేపథ్యగాయకుడుగా, స్క్రీన్‌ప్లే రచయితగా, త్యాగయ్య నాగయ్య, నాగయ్య త్యాగయ్యగా తన ప్రతిభా విశేషాలను వెల్లడించుకున్నారు. త్యాగయ్య పాత్రలో ఏ సంగీత విద్వాంసుడు చూపని భావాన్ని, భక్తిరసాన్ని చూపెంచారు నాగయ్యగారు. పద్యానికిగానీ పాటకుగానీ, రాగంకంటే భావమే ముఖ్యమని చెప్పేవారు నాగయ్యగారు. ఈ విధంగా ఆయన త్యాగయ్య చిత్రానికి అన్ని బాధ్యతలూ తామే వహించి బహుముఖ ప్రజ్ఞావంతుడనిపించుకున్నారు. కాని ఆ చిత్రం ఆర్థికంగా అపజయంపొందింది.

అంతటితో నాగయ్యగారు ఎడారిలో నిలబడిపోయారు. కష్టపడి సంపాదించిన డబ్బంతా త్యాగయ్య చిత్రంతో పూడ్చుకుపోయింది. అయినా నిరుత్సాహపడక తెలుగు

తమిళ, చిత్రాల్లో నటిస్తూ కాలూ, చెయ్యీ కూడ తీసుకుని భక్త రామదాసు చిత్రాన్ని ప్రారంభించారు. ఈ నిర్మాణం ఐయిదు సంవత్సరాలు పట్టడంతో తిరిగి ఆర్థిక చిక్కుల్లో పడిపోయి సంపాదించిందంతా దానికై వెచ్చించి చిత్రాన్ని పూర్తి జేసి విడుదల చేశారు. రామదాసు పాత్రలో ఆయన జీవించారు. అద్భుతంగా నటించారు. ఆంధ్రదేశమంతా నీరాజనమిచ్చింది. కాని నాగయ్యగారి చేతికి చిల్లి దమ్మిడి చేరకపోగా, అప్పులపాలై పోయారు. ఆ విధంగా ఆయన నిరుపేద అయిపోయారు.

నాగయ్యగారు తన 69 సంవత్సరాల జీవితంలో 50 సంవత్సరాలు నాటక, సినిమా రంగాలకే ధారపోశారు. దాదాపు మూడువందల చిత్రాలలో పాత్రలు ధరించిన ఆంధ్రుల అభిమాన నటుడు నాగయ్యగారు.

దేశంలో ఎన్నో ఘన సత్కారాలు అందుకోవడమేగాక, మైసూరు, తిరువాన్కూరు, మహారాజుల దర్బారులలో ఘంటా కంకణాలతో సన్మానాలందుకొన్న ధన్యజీవి నాగయ్యగారు.

దయార్ద్రహృదయులైన నాగయ్యగారు తాను సంపాదించిన సంపాదనలో చాలాభాగం దానధర్మాలకే వెచ్చించారు. త్యాగశీలి, నిగర్వి అయిన ఒక ప్రసిద్ధ నటుణ్ణి ఆంధ్రదేశమేకాక, దక్షిణభారత దేశమే కోల్పోయింది. అంతటి మహానటుడేడీ, ఆ పాత్రలు ధరించడానికి? ఆయన సేవలకుమెచ్చి తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ నాగయ్యగారి కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి పూనుకుంది. అందుకు తమిళనాడు ప్రభుత్వం మద్రాసు త్యాగరాయనగరు పానగల్ పార్కువద్ద ఆయన శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి అనుమతి నివ్వడం ఎంతైనా అభినందించ తగిన విషయం.



తమిళ సంగీత నాటక అకాడమీ కార్యదర్శి శ్రీ ఎస్. డి. సుందరం వద్దనుంచి షీల్డును స్వీకరిస్తున్న శ్రీనాగయ్య....



'బీదలపాట్లు' లో శ్రీనాగయ్య.

# నేనెరిగిన నాగయ్యగారు !

రచన :
నేరెళ్ల వేణుమాధవ్
ఎం. ఎల్. సి.

శ్రీనాగయ్య శిలా విగ్రహం విషయంలో శ్రీ ఇంటూరి, శ్రీ గుమ్మడి, తదితరులు చేసిన సేవను తెలుగుదేశం మరిచిపోదని నేను ప్రప్రథమంలో చెప్పక తప్పదు. తెలుగు సినీ ఆర్టిస్ట్సు అసోసియేషన్ విగ్రహ ప్రతిష్ఠకు కావలసిన ద్రవ్యసహాయాన్ని చేయడానికి ముందుకురావడం శ్లాఘనీయమైన విషయం. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో శ్రీ గుమ్మడి సారథ్యంలో ఆంధ్రదేశంలో సాంస్కృతిక ప్రదర్శనలనిచ్చి తెలుగు సినీ ఆర్టిస్ట్సు అసోసియేషన్ తెలుగు సాంస్కృతికి నీరాజనం పట్టింది. ఇటీవల డాక్టరు ఎం. ప్రభాకరరెడ్డి సారథ్యంలో యీ అసోసియేషన్ మద్రాసులోని వరద బాధితుల సహాయనిధిని పోగుచేసిందన్న విషయాన్ని కళాకారులందరు హర్షించక తప్పదు.



శ్రీనాగయ్య బహుముఖ ప్రజ్ఞాశాలి. వారు గొప్ప నటులేకాక, గొప్ప సంగీత దర్శకులు, గాయకులు, చిత్ర దర్శకులు, చిత్ర నిర్మాతకూడా. శ్రీ సైగల్ గానంలో 'మెలడీ' మాత్రమే ఉండేది. నాగయ్యగారి గానంలో 'మెలడీతోపాటు ఎమోషన్'కూడా పుష్కలంగా ఉండేది. వారి నటనకు, గానానికి స్వర్గీయ డాక్టరు రాధాకృష్ణన్ ఎంతగానో ముగ్ధులయ్యేవారు. ఆబాలగోపాలం శ్రీనాగయ్య గానసమ్మోహనాస్త్రానికి వశులు కావడంలో వింత ఏమీలేదు.

ఇక్కడ నేను ఒక వ్యక్తిగత సంఘటనను ఉదహరిస్తున్నా. డాక్టరు రాధాకృష్ణన్ గారింట్లో నాగయ్యగారు నా ధ్వన్యనుకరణ ప్రదర్శనను యేర్పాటు చేశారు. మద్రాసునుంచి శ్రీనాగయ్య వచ్చారని రాష్ట్రపతి ఆంతరంగిక కార్యదర్శి లోపలికివెళ్ళి చెప్పడంతోటే డాక్టరు రాధాకృష్ణన్ బయటికొచ్చి, నాగయ్యగారి రెండుచేతులు పట్టుకొని, వంగి ఆయన రెండు చేతులను కండ్లకద్దుకున్నారు. 'మీ దర్శనం చేయడానికి వచ్చాను' అని నేననగానే 'నా దర్శనం చేస్తే ఏముందీ-నాగయ్యగారి దర్శనంచేస్తే పుణ్యం వస్తుంది' అని డాక్టరు రాధాకృష్ణన్ అన్నారు. "అయ్యో-రామరామ" అని నాగయ్యగారు తన వినయాన్ని ఆ సమయంలో వెల్లడించడం జరిగింది. నాగయ్యగారి అనుజ్ఞమీద డాక్టరు రాధాకృష్ణన్‌గారిని అనుకరిస్తూ నేను ప్రదర్శననిచ్చాను. వారు నా ప్రదర్శనను ఎంతో మెచ్చుకొని "మరి నాగయ్యగారినికూడా మీరు అనుకరించవలసి ఉంటుంది" అన్నారు వెంటనే నాగయ్యగారు పాడిన పాటలను, పద్యాలను పాడుతూ, వారి బాణీని ప్రదర్శించాను. డాక్టరు రాధాకృష్ణన్ నా అనుకరణచూసి పరవశులయ్యారు. డాక్టరు రాధాకృష్ణన్‌లాంటి మహాపురుషునితో అంతసేపు నేను కాలంగడపడానికి కారణభూతులయిన మహాపురుషులు నాగయ్యగారు.

ఆ మహానుభావుని కాంస్య విగ్రహం మద్రాసులో ప్రతిష్ఠింపబడుతుండడం నటలోకానికి గర్వకారణం. భావితరాల కళాకారులకు ఆ విగ్రహం ఒక "దీపస్తంభం"గా రూపొందాలని నా ఆకాంక్ష.

బహుముఖ ప్రజ్ఞాన్వితులయిన మహానటుడు

## పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య

దివ్యస్మృతికి మా అంజలి ఘటిస్తున్నాం.



## పి. ఎస్. ఆర్. పిక్చరుస్

7, మూలనీ రోడ్, మద్రాసు-600017



—: నిర్మాత :—

పింజల సుబ్బారావు

# గీతాంజలి !

రచన :
ఐమంది రామారావు

సుజలాం....సుఫలాం....సస్యశ్యామలాం....
మాతరం....వందేమాతరం....మాతరం....అంటూ
నీలినీలాకాశప్రాంగణంలో అడుగు పెట్టాడు...
అయ్య !...హా అయ్య !....నాగయ్య !....ఓ అయ్యా !...
'ఓం'కార శబ్ద స్రవంతిలో...కలసిపోయేవా ?
అశేషాంధ్రకారటి కన్నీటి...తరంగాల్లో....కరిగిపోయేవా ?...
లేదు...లేదు !.... ....లేదు....లేదు !....
నువ్వుపోలేదు...మూగపోలేదు !
కాలచక్ర పరిభ్రమణంలో....కలిసిపోలేదు !....
గీతానికి..."స్వరం"లా....
సంగీతానికి...."పరం"లా....
"కళామతల్లి"కి హారంలా....
ఆ నాటికీ....ఈనాటికీ....ఏనాటికీ....
భాషించేవూ....శ్వాసించేవు !....
మండే గుండెల "రూపం" నీవు !....
మానవతా మూర్తి...."స్వరూపం" నీవు !.
నీ కన్నులకందని....భావంలేదు !....
నీ పెదవులకందని "రావం" లేదు !....
ఉత్తమ నటుడై పండిపోయేవు....
విశ్వమంతా....నిండిపోయేవు !....అయ్యా ! ...
"నటకేళి"లో నీ ఆట.... "రసకేళి" లో నీ పాట....
జీవితంలో నీ మాట....మరచిపోను....మరువలేను !
ఏదో....ఎక్కడో....సుదూర తీరాలకు పోయేవని.
మిన్నులాంటి నిన్ను మరచి...."మన్ను"లానే వుండలేను !
చిత్రసీమకు "వెన్ను"లా....
కన్నీటి కథలకు "కన్ను"లా....
నాలో.... ....లోలో.... ....చూసుకుంటాను....
కవితలు....స్రవితలు....చేసుకుంటాను !.... ...

—(●)—

# శ్రీ నాగయ్య అమరుడు !



రచన :
విద్యావిశారద
శ్రీ గోటేటి శ్రీ రామారావు



'మరణించుట తథ్యము మహిమాన్వితులైన'—అన్నారు. పుట్టిన ప్రతిప్రాణీ గిట్టవలసియున్నది—ఈ పుట్టుక గిట్టుకల మధ్య పరిత్రను సృష్టించవలసి వున్నది. లేనిచో ప్రపంచ గమనములో చరిత్ర ఏమున్నది ? గిట్టునది శరీరమని చెబుతున్నప్పుడు ఆత్మకు బాదేమున్నది? చావులేని ఆత్మను సముపార్జించినవాడు అమరుడే కదా!



నాగయ్య అమరుడే! అలాటి చావులేని ఆత్మను సముపార్జించినవాడు! లోక భీకర శక్తులనుంచి, విషవలయములనుంచి — మనిషి తప్పుకోగల మహిమాన్వితమ్మైన పాత్రలను ధరించినవాడు! ఎవరు కాదనగలరు — కాదనగలిగేంటి పాత్రలా — అవి!

నాగయ్య ధన్యజీవి — ఆయన ధరించిన పాత్రలు అటువంటివి. ఆ జరామరణములకు అతీతమైన పాత్రల నతడు ధరించాడు. ధరించాడనడంకూడా తప్పేమో! ఆ పాత్రల్లో ఆయన జీవించాడు. అందర్నీ ఎక్కడో మహత్తరమైన భక్తిజ్ఞాన లోకాలకు గొనిపోయాడు. ముమ్మిడివరం బాలయోగి — సిద్ధుడూ, ప్రసిద్ధుడూ అయ్యారంటే నాగయ్య ధరించిన "పోతన" ప్రభావమేకదా!

త్యాగయ్య పేరు నిలిచినంతకాలం నాగయ్య నిలుస్తాడు. పోతన, వేమన, రామదాసు, భక్త గోరకుంభార్ చరిత్రలూ — ఆ చరిత్రలపట్ల ప్రజల్లో భక్తి ప్రవత్తులూ వున్నంతకాలం—నాగయ్య భూలోకంలో చిరస్మరణీయంగా ఉండగలుగుతాడు.

వ్యక్తిగా, సంగీతశక్తిగా, దేశభక్తి, ప్రపూరితమైన వ్యవస్థగా నాగయ్య సాధించినది — నాగయ్య శ్రమించినదీ ఎక్కువమందికి తెలియకపోవచ్చు! ఏకైక ఛత్రాధిపత్యంగా సినిమారంగాన్ని ఏలుతున్న రోజుల్లో స్వరాజ్య సమరం బయల్దేరింది. గోఖలే, గాంధీ ప్రఖ్యాత నాయకులు స్వాతంత్ర్య శంఖాన్ని విజయదుందుభిల్లా నలుదిశల్లా మ్రోగించారు. నాగయ్య — అంకురితమైన దేశభక్తితో — తనకూ అనేదీ ఏవీ లేకుండా — దేశానికే సర్వస్వమూ ధారపోశాడంటే ఆశ్చర్యం కలుగదు! ఆ రోజుల్లో రెండు చేతుల్లా సంపాదించి. నాగయ్య ఏమి మిగిల్చారూ — అంటే ఏమీ లేదు! చివరకు మూడడుగుల స్థలాన్నీకూడా ఆయన సముపార్జించుకోలేకపోయారు. నిజానికి చరిత్రలో యిలాంటివారెందరున్నారు ?

ఎందరో మహానుభావులన్నట్టు — ఎన్నెన్నో రసవత్తర చిత్రాలు—! వాటన్నిటినీ భారత ప్రభుత్వం 'మ్యూజియమ్"లో భద్రపరుస్తూ—నాగయ్య పేరిట ఏటేటా అవార్డులిస్తూ — నాగయ్య కృషీవలత్వానికి అమరత్వం ప్రసాదించవలసిన బాధ్యత భారత ప్రజలకూ, ప్రభుత్వానికీ ఉన్నది. అనవరత నిష్ఠాగరిష్ఠుడు నాగయ్యకు అత్యంత స్నేహశీలియైన శ్రీ ఇంటూరి అకుంఠిత ప్రయత్నము, కృషీవలత్వములతో నాగయ్య కాంస్య విగ్రహం వెలయడం—తెలుగు సినీ ఆర్టిస్టు అసోసియేషన్ ఇందుకు తలమానికగా నిలవడం హర్షించదగిన విషయం! ఈ కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపనా సమయంలో నాకు పూజ్యపాదులూ, అమర జీవులైన శ్రీ నాగయ్యగారికి భక్తిపూరితమైన అంజలి ఘటిస్తున్నాను.

# నాగయ్యగారితో నా అనుభవాలు!

రచన : రాళ్ళబండి కామేశ్వరరావు

ఒకరోజు 'రామదాసు' చిత్రం ఆఖరి కాల్‌షీటు. డైరెక్టరు కూడా నాగయ్యగారే. అందు రామలక్ష్మణులు. శ్రీ రామారావుగారు. శ్రీ శివాజీగణేశన్‌గార్లు. షూటింగ్ అయిపోగానే శ్రీ శివాజీగణేశన్ నాగయ్యగారికి పాదాభివందనముచేసి వారి రెండు చేతులు పట్టుకుని "అప్పా నాన్ పోయిటి వరేన్" అని చెప్పారు. నాగయ్యగారు మూగపోయి, అలా చూస్తూ ఆనందభాష్పాలు రాల్చారు. ఆ దృశ్యం మరువరానిది. శ్రీ శివాజీగణేశన్ అంతటి మహోన్నత కళాకారునికి. నాగయ్యగారి పట్లవున్న ప్రగాఢమైన భక్తి. ఆ అవ్యాజమైన ప్రేమ. ఏ కొలమానానికి అందదని అనిపించింది.

శ్రీ నాగయ్యగారికి "పద్మశ్రీ" ఇచ్చి గౌరవించిన సంగతి తెలిసి. నేను వారి ఇంటికివెళ్ళి Congratulate చేసాను. వారు "కామేశ్వరరావుగారు – ఏదో పద్మశ్రీ అంటూ ఈ పత్రము ఇచ్చారు. తగిలించటానికి కాగా. గోడ మేకు ఏర్పాటుచేయాలి. దీనికి బదులు 10 రూ॥లు ఇస్తే ఎంత సంతోషించేవాడినో, అన్నారు. లోకం అంతా దాన్ని పొందుటకై తపిస్తుంటుంటే, వారు చెప్పిన అభిప్రాయానికి నా మతి చెడింది. అంటే వారు పద్మశ్రీలకు ఒక అతీతమైన మహా వ్యక్తి అయివుండాలి.

మొన్న సంవత్సరాది రోజున ఆ వీధిగుండా వస్తూ నాగయ్యగారి ఇంటివద్ద ఒకక్షణం ఆగాను. పద్మశ్రీమీద వారు అన్న మాటలు నాకు గుర్తు వచ్చాయి. అవి తలచుకుంటూ ముందుకు సాగిపోతున్న నన్ను ఒకరు ఎదురై 'నమస్కారం కామేశ్వరరావుగారు' అంటూ 'మీకు నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేస్తున్నాను' అని అన్నారు. అప్పుడు నేను అవి నీదగ్గరే వుంచుకో-ఒక 10 రూ॥ అందజేయి–సంతోషించుతాను. అని అన్నారు. అతను నివ్వెరపోయాడు. అతనికి నా "మూడ్" తెలియపరచాను. అప్పుడు నన్ను సవ్యంగా అర్థంచేసుకుని సవ్యంగా వెళ్ళాడు.

నాగయ్య షష్ట్యబ్దికి పుట్టపర్తి సాయిబాబాగారు ఆ రోజంతా అక్కడేవుండి వారికి నూతన వస్త్రాలు ఇచ్చి ఒక వుంగరం వ్రేలికి తగిలించి సత్కరించారు. ఆ రోజు ఆ షష్ట్యబ్ది వుత్సవమునకు కొన్ని వందలమంది వచ్చి వుంటారు. సన్మానాలు నాగయ్యగారికి జరిగినంత మహా వైభవంగా మరెవ్వరికీ జరిగివుండవని అనిపిస్తోంది. వారు ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు వారి సహాయ సహకారాలు పొందనివాళ్ళంటూ వుండి వుండరు. ఎవరు వచ్చి ఏ సహాయము అర్థించినా అది తనది అన్నట్లు చేసేవారు. శ్రీనాగయ్యగారి నటన వరప్రసాదమని నా విశ్వాసము. వారు నటులేకాక మహా గాయకుడు. డైరెక్టరు. మ్యూజిక్ డైరెక్టరు. ప్రొడ్యూసరు. ఇన్ని సామర్థ్యాలతో ఎన్నో సలక్షణ భరితమైన ఆ మహావ్యక్తి జీవితము ఒక సృష్టి వంటిది.



'యోగి వేమన' లో శ్రీనాగయ్య



'పాండురంగమహాత్మ్యం' చిత్రంలో శ్రీనాగయ్య.



శ్రీనాగయ్యను వెలుగులోకి తెచ్చిన
వాహినీ సంస్థ అధినేత శ్రీ బి.ఎన్. రెడ్డి.



'స్వర్గసీమ' లో శ్రీమతి భానుమతితో శ్రీనాగయ్య



నటశేఖర, కలియుగ ఆంజనేయ శ్రీ బాలాజీని
ఆశీర్వదిస్తున్న శ్రీనాగయ్య

# శ్రీ నాగయ్య
## మనీషి - మానవాతీతుడు

కమలాకర కామేశ్వరరావు..

నాకు శ్రీ నాగయ్యగారితో పరిచయం 1937 సం॥లో 'గృహలక్ష్మి' చిత్రం ద్వారా సంభవించింది. ఆ చిత్రంలో వారు కాంగ్రెసు దేశసేవకుడుగా ప్రత్యక్షం అయ్యారు. శ్రీ నాగయ్యగారికికూడా చిత్ర జగత్తుకు ప్రవేశం అదే.

అప్పట్లో శ్రీ నాగయ్యగారిది నాకు 'వేషంగా' తోచ లేదు. అంత సహజంగా, సత్యంగా కనిపించింది. ఆ తరువాత—'వాహినీ' సంస్థవారు 'కథానాయకుడు' గానూ, నేను 'సహదర్శకుడు'గానూ వరుసగా కొన్ని చిత్రాలలో పని చేశాం- 'పోతన', 'వేమన' చిత్రాలతో సహా.

ఇన్ని వైవిధ్య వేషాలు వేసిన నాగయ్యగారి విషయంలో నా మొదటి 'అనుభవం' మారలేదు. వారిది 'నటన' కాదు. వారు వేసిన "పాత్రే" తాము అయిపోవడం వారికి జన్మతః వచ్చిన వరం.

'పోతన'గా నటించవలసి వచ్చినప్పుడు—

పోతన అంటే ఒక కర్షకుడు. భక్తుడు. సన్నో బక్కో ఉండాలి. పీల స్థూలంగా ఉండాలే అని కొందరు సందేహించకపోలేదు.

కాని చిత్రం చూచినమీదట బహుశః పోతన యిలాగే వుండేవారేమోనన్న నిశ్చయానికి రాగలిగారు ఆ సందేహించినవారుకూడా!

మరి అంత లావు మనిషి ఏమైపోయారో! వారు పోతనే!

అందువల్లనే నాగయ్యగారి 'పోతన' చిత్రం బడిపిల్లల పుస్తకాలలోకి పోతనగా ముద్రితం అయిపోయింది.

నాగయ్యగారు 'పోతన'గా పండించిన భక్తి ఎంత ప్రాభవం కలదో తెలుసుకోవాలీ అంటే-

ముమ్మిడివరం 'బాల'యోగి' ఒక రాజ్యాంగం ఒక సామాన్య పశువుల కాపరి ఒక రాజయోగిగా పరిణతి నొందిన "పరుసవేది" లాంటిది శ్రీ నాగయ్యగారి 'నటనా' సౌలభ్యం.

నాగయ్యగారితో నాకుగల పరిచయాన్నిబట్టి చూస్తే—

వారు "మానవత కరుడుగట్టుకున్న మనీషి"! దయాంతఃకరణ కలిగినటువంటి ఉత్తముడు.

మంచి చూపు! మంచి మాట! ప్రసన్నత మూర్తీభవించిన రూపం!

స్నేహశీలి! "సహాయత" వారి సహజ గుణం!

వారికి చేతనైనంత వరకు-కనీసం మాటలోనైనాసరే! ఆదరణ పొందనివారు అరుదు.

దేవాలయంలోని దేముణ్ణి చేరడానికి జంకుగొంకులు ఎట్లా పొందనక్కరలేదో అట్లాగే నాగయ్యగారి విషయంలోకూడా! అంత ఆప్యాయత! అంత బంధుత్వం! మరి అటువంటి నిరాడంబర జీవి. ప్రేమమూర్తి—

రాగిగా, విరాగిగా, భక్తుడుగా, కర్మయోగిగా, జ్ఞానిగా జనాన్ని మెప్పించి, ఒప్పించి చిత్ర జగత్తులో ఒకప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకున్నారు అంటే అందులో ఆశ్చర్య మేమున్నది!

వారి స్థానం వారిదే!

వారు పోల్చరాని. సామాన్యులకు అతీతులు, వారికి వారే సాటి!

ఇట్టి అసాధారణ వ్యక్తికి ప్రాపంచిక దృష్టిలో ఒక శాశ్వతత్వం కలుగజేయడం ఎంతైనా అవసరం ఉంది.

శ్రీ ఇంటూరి వేంకటేశ్వరరావు తమ అనన్య దీక్షా పటుత్వంతో నేటికి శ్రీ నాగయ్యగారి కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించడంద్వారా వారికి ఒక స్మారక చిహ్నం ఏర్పాటు చెయ్యబోతున్నారూ అంటే అది అందరూ హర్షించదగ్గ విషయం. ముఖ్యంగా ఆస్తికులు!

అర్హతలు లేనివారందరికీ శిలా, కాంస్యవిగ్రహ స్థాపన జరిగే యీ రోజుల్లో- ఇట్టి స్మారక చిహ్నాలకు విలువ కోల్పోయిన యీ తరుణంలో—

నాగయ్యగారికి మాత్రం దీనివల్ల ప్రత్యేక ఘనత ఏమి రాగలదనే సందేహం కలిగే అవకాశం ఉన్నప్పటికీ—

న్యాయంగా ఆలోచిస్తే—

అప్పటి యీ కాంస్యవిగ్రహ స్థాపనద్వారా శ్రీనాగయ్యగారి స్మారక చిహ్నం ఏర్పాటు చేయవలసిన అవసరం ఎంతైనా కనిపిస్తుంది.

ఈ స్మారక చిహ్నం శ్రీ నాగయ్యగారికన్నా, వారి ద్వారా ప్రజా హృదయంలో స్థాపితం అయిపోయిన పోతన, వేమన, త్యాగరాజు, రామదాసు వంటి మహాభక్తులకు; తద్వారా ప్రజా బాహుళ్యంలో అనుషంగం భక్తిప్రపత్తులు యినుమడించి దేశం ఆధ్యాత్మికంగా పునరభివృద్ధినిగాంచి ప్రపంచ సుఖశాంతులకు దోహదంచేసే అవకాశం ఎంతైనా ఉంది.

శ్రీ నాగయ్యగారు చిరస్మరణీయులు అగుదురుగాక! తద్వారా—

సర్వేజనా స్సుఖినోభవంతు!

శుభం!

## నట మార్తాండులు శ్రీ నాగయ్య

రచన: కె. సత్యనారాయణ

మధ్యందిన మార్తాండుని మహోన్నత తేజోవైభవం లోకి రెండు కళ్ళువిప్పి తదేక నిష్టతో చూడాలన్న కోరిక ఒకటి ఎప్పుడూ వుండేది నాకు. కాని ఇప్పటికీ సాధ్యం కాలేదు. అలాగే పూజ్యులు పద్మశ్రీ నాగయ్యగారి గురించి నాలుగు వాక్యాలు వ్రాయమంటే అదికూడా అంతటి సమస్యే అయింది నాకు.

ఆయన ధరించిన అసాధారణమైన పాత్రల్నిచూసి ఆనందించగలిగానేకానీ ఆ పాత్రల్ని వర్ణించటానికి ఈ మనసుకు మాటలు రావడంలేదు. ఆయన తన పాత్రల్ని నటించారా లేక ఆ పాత్రల్లో జీవించారా అన్నది ఇప్పటికీ తేలడం లేదు నాకు.

శ్రీ నాగయ్యగారు గొప్పనటులేకాక, గాయకులు, దర్శకులు, సంగీత దర్శకులుకూడా. శ్రీ నాగయ్యగారు ఒక వ్యక్తే కాదు. ఆయన మహా సంస్థకూడా. ఆ సంస్థలో పెరిగిన అనేకులు ఈనాడు వివిధరంగాల్లో దేదీప్యమానంగా వెలుగుతున్నారు. ఆయన ఆశీర్వచనంలో భవిష్యత్తుకు బంగారు బాటలు వేసుకున్న వాళ్ళలో నేనుకూడా ఒకణ్ని. ఆ రోజు సంఘటన నాకు ఇంకా కళ్ళముందు కట్టినట్లుగా వుంది. అది 1958 వ సంవత్సరం జులై రెండవ తేదీ. ఆ దినం నా నటజీవితానికి నాందీవచనం పలికిన రోజు. కీ॥ శే॥ డి. ఎల్. గారి "సిపాయి కూతురు" లో నేను రాజ కుమారుడి వేషంలో వున్నాను. శ్రీనాగయ్యగారు రాజ గురువు వేషంలో వున్నారు. ఆ చిత్రంలోని మొట్ట మొదటి షాటు మా ఇద్దరిపై చిత్రీకరిస్తున్నారు. అదికూడా రాజగురువు రాకుమారుణ్ణి ఆశీర్వదించడం. తొలిషాట్ ఓ. కే. అయింది. వెంటనే నాగయ్యగారు నటజీవితంలో కూడా నేను అత్యున్నత శిఖరాలు అందుకుని అందరి ఆదరాభిమానాలు పొందాలని మనసారా ఆశీర్వదించారు. వారి ఆశీర్వచనా ఫలితమే ఈనాడు నన్ను మీ అందరి ఆదరాభిమానాలు పొందేటట్లు చేసింది.

శ్రీ నాగయ్యగారు గుప్తదానాలుచేసి తనదంటూ ఏమీ మిగుల్చుకోలేకపోయారు. కానీ అందరి అభిమానాన్ని తనదిగా మిగుల్చుకున్నారు. ఆయన ఒక మహామనిషి.

అటువంటి మహావ్యక్తి జ్ఞాపకార్థం చేస్తున్న వారి కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపనా కార్యక్రమంలో పాల్గొనే అవకాశం కలిగినందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది. చిరంజీవులై వారు మనల్ని ఎప్పుడూ ఆశీర్వదిస్తూనే వుంటారు.



నాగయ్య కారణజన్ముడు - ఇలాటి మహావ్యక్తులుపుట్టడమే అరుదు! వారి కీర్తిని చిరస్థాయిగా నిలపడం కోసరం కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపనం జరుపుతూన్న కృషీవలురెల్లరకూ మా శుభాభివందనములు.



## రామరాజ్ ప్రింటర్స్

1, తంబయ్య రెడ్డి స్ట్రీటు, వెస్టు మాంబళమ్
మద్రాసు–600 033

ఫోను : 422091

అందరికీ తలలోని నాలుకగా ఉంటూ, ఆంధ్ర తమిళ సోదరుల అవ్యాజానురాగాన్ని అనవరతమూ చూరగొంటున్న రచయిత, సంపాదకులైన విద్యా విశారద **'గోటేటి శ్రీ రామారావు'** యాజమాన్యంలో – తెలుగు, తమిళ, ఆంగ్ల భాషల్లో అందమైన అచ్చు పనులను నిర్వహిస్తున్న మీ అందరి సంస్థ

నిర్వాహకు : **కె. సరోజ**

---

కన్నుల పండుగగా – ఆఫ్ సెట్
రంగుల్లో ఆంధ్ర ప్రజల
అభిమాన మాస పత్రిక గా

ఎడిటర్ : **గోటేటి**




— మాస మాసమూ వెలువడ్తూ —

నా నాటికీ విశేషప్రజాభిమానం పొందుతూంది.

విడిప్రతి రు **2/-** సినీ గోయర్స్ సాలు చందా **30/-**లు

(సినీ గోయర్స్‌కు గోటేటి ఫిలిం డైరీ. ఇతర ప్రత్యేక సంచికలు చితం)

సినీరమ – సి - 290, VII ఎవెన్యూ, అశోక్ నగర్, : : మద్రాసు – 600 083.

ఫోను : 422825

దొంగరాముడు

తోడికోడళ్లు

మాంగల్యబలం

వెలుగునీడలు

ఇద్దరు మిత్రులు

చదువుకున్న అమ్మాయిలు

ఆత్మగౌరవం

పూలరంగడు

అమాయకురాలు

బంగారుకలలు

తమిళ చిత్రాలు

ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి

మంజళ్ మహిమై

తూయఉళ్లం